## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120034982

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

"నిన్ను నీవు తెలుసుకో" అన్న
భగవాన్ శ్రీ రమణ మహర్షికి,

ప్రేమతో.

చదివినంతకాలం అనారోగ్యం వెంటాడగ, చదువు చాలించి, చలం స్నేహంకోరి, తిరువణ్ణామలై చేరి, సౌరిస్‌గారిని, అరుణాచలాన్ని, దర్శించి, భగవాన్ని చదవడం ప్రారంభించిన తర్వాత కలిగిన ఓ దివ్యమైన, సుందరమైన, మధురమైన, యదార్థమైన స్వానుభవానికిది రూప కల్పన.

ఆ అనుభవానందపు అమృతఘడియల్ని, కాలగర్భంలో కలసిపోనివ్వక, వాటిని రసభరితం చేయాలన్న ప్రయత్నమే ఈ పుస్తకం.

అందరిలో వున్న ఆత్మే, కృష్ణపరమాత్మ. ఆ ఆత్మ సాక్షాత్కారమే శ్రీకృష్ణ సందర్శనం. అది ఒక అనుభవం. అందమైన అనుభవం. అన్ని అనుభవాల్లోకి అత్యద్భుతమైన ఆనందానుభవం. అది ప్రేమానుభవం. దాన్ని మాటల్లో వర్ణించడం అసాధ్యం. అది ఎంత మధురమో చెప్పడానికి మౌనమే మార్గం.

దివ్యమైన మురళీనాదం అనుక్షణం వినాలంటే. లోపల నిశ్శబ్దంగా వుండాలి. ఆత్మానుభవం కావాలంటే, ప్రేమలో లీనం కావాలి.

కృష్ణ.

# మోహరాత్రి

అందరి హృదయాల్లో ఆత్మజ్యోతిగా ప్రకాశించే పరమేశ్వరుడు లీలామానుష రూపధారియై, ప్రేమ స్వరూపుడై వ్రేపల్లెలో చిన్ని కృష్ణుడుగా తిరుగుతూ, తన మోహనరూపంచేత గోపాంగనల మనసులు దోచుకున్నాడు. అతనికి జన్మతః వచ్చిన చక్కని చిరునవ్వు, హృదయం లోంచి మృదువుగా, నిర్మలంగా, నాజూకుగా పెదవులమీదకు పాకి, లేచెక్కిళ్ళ నునుపుతో కలిసి, మరింత రసికత్వాన్ని పొంది, గోపాంగనలను వెంట తిప్పుకుంది.

సర్వసాధారణంగా కృష్ణుడు ఎవరితోనూ తనకు తానై మాట్లాడ లేదు. అతని చూపు ఈ భూమికి చెందింది కాదనిపిస్తుంది. కాని, అతడు దృష్టినిలిపి, ఎవరితోనైనా మాట్లాడాడా .......... ఇంక ఆ మాటల మాధుర్యంలో సర్వం మరచి, ఆ అందాలకు అర్థాలు, ఆ ఆనందానికి అవధులు, ఆ శృంగార శిఖరాల కొనలు అందుకునేవరకు వొదలని గట్టి పట్టుదల వాళ్ళలో, నరనరాల్లో, ప్రతి రక్తకణంలో ప్రవేశించి, క్షణం నిలవనియ్యక వెర్రివాళ్ళను, చేతకానివాళ్ళను, పిచ్చివాళ్ళను, ప్రేమ బైరాగుల్నిచేసి మరీ వొదిలేది.

కృష్ణుడు బృందావనం వెళ్ళడం ఆరంభించినప్పటినుంచీ, అతని మీద ఎన్నో అపవాదులు వొచ్చాయి, అనుమానాలు పుట్టాయి. కొన్ని అభాండాలు కూడా వేశారు.

"పట్టుమని పదహారేళ్ళులేవు-ఏమిటా విరహాలూ, శృంగారాలూ", అంటూ ముసలివాళ్ళ మూలుగు.

"అర్ధరాత్రి వరకు ఆడవాళ్ళను అట్లా వెంట తిప్పుకుంటున్నాడు. ఆ ఆటల్లో, పాటల్లోపడితే ఏ ఆడదన్నా సరిగ్గా కాపురంచేస్తుందా?" అని మగవాళ్ళ అసూయ.

"తమ భార్యల్ని మాయచేసి, మరిపించి, తమకు కాకుండా చేస్తున్నాడు" అని భర్తల గోల.

"కృష్ణుని చెలిమికోరి పిల్లలు ఇంటిపట్టున వుండటంలేదు," అని పెద్దల ఫిర్యాదు.

కృష్ణుని చేష్టలన్నీ అన్యాయాలనీ, అక్రమాలనీ, అధర్మాలనీ, అసభ్యకరమైనవనీ అవినీతికరమైనవనీ, అతని ఆటల్ని ఏవిధంగానైనా సరే అరికట్టాలనీ, అతన్ని పట్టుకుని నిందార్హుణ్ణి చేయాలనీ, తీవ్ర ప్రయత్నాలుచేసి, చివరకు పశ్చాత్తాపపడ్డ వారెందరో!

కృష్ణుడు గోపబాలురతో కలసి, గోవుల్ని కాసేవాడు. బృందావనంలో విహరించేవాడు. గోపాంగనలతో క్రీడించేవాడు. యశోద వొడిలో పడుకుని ఏ లోకానివో, ఏ కాలానివో కబుర్లు చెప్పేవాడు. మళ్ళా ఏమీ ఎరగనట్లు, ఏదీ పట్టనట్లు తిరిగేవాడు. అతన్ని కొందరు తిట్టారు. కొందరు నిందించారు. కొందరు అవమానించారు. కాని, కొందరు అతన్ని ప్రేమించారు, లాలించారు. అప్పటికే అతనిమీద ఎన్నో అపవాదులు వొచ్చాయి.

కృష్ణుడు సామాన్య మానవుడు కాడు. అతనొక ప్రేమ ప్రవాహం. ఆ అమరవాహిని జలపాతం-ఎక్కడెక్కడో, ఏవి ఉన్నత పర్వత శిఖరాలనో అధిరోహించి, ఏ లోతైన లోయల గుండానో ప్రవహించి, మరెక్కడికో పరిగెత్తి, వారి హృదయార్తిని తీర్చి, క్షణం నిలవక ముందుకు సాగుతుంది. అవే కృష్ణలీలలు. అదే కృష్ణమాయ. అతనితో అనుభవం, జీవితానికో వరం. అతని ఆహ్వానమే అదృష్టం. దాన్ని అందుకుని కూడా ఆగి, ఆలోచించి, అనుమానించే శిలాహృదయులకు ముక్తిలేదు. తమ ప్రయత్నబలంతో అతన్ని పొందాలని చూస్తేం వారా, అంతటితో ఆఖరు వారి జీవితాధ్యాయం. వారి చేతుల్లో కృష్ణుడు ఎట్లానూ నిలవడు.

* * *

ఆ రోజు శరత్ పౌర్ణమి. పగలంతా మంచి ఎండకాసింది. ఆ సాయంత్రం బృందావనంలో—ఏ మూలనో, ఏ పొదమాటునో, ఏ చెట్టు కొమ్మమీదనో, ఏ రాళ్ళగుట్టమీదనో, కోనేరు మెట్లమీదనో, రాధ వాడిలోనో— ఎక్కడినుంచో యశోద కళ్ళలోనే కాంతి, గోపికా హృదయాలకు, శాంతిస్వరూపుడైన చిన్నికృష్ణుడు మురళి వాయిస్తూ జీవన రాగాల్ని పలికిస్తున్నాడు.

ప్రేపల్లెకు కొంచెం దూరంలో, బృందావనముంది. అందు ఎక్కడా లేనన్ని రకరకాల, రంగురంగుల పూల మొక్కలూ: మల్లె, మాలతి మధు మాలతి, రాధామనోహరి, జాజి మొదలైన పూపొదలూ; నేరేడు, మారేడు, మామిడి, మోదుగ, వెలగ, పున్నాగ, నాగలింగ, చంపక,

శిరీష, శివగన్నేరు, కేతికి, కదంబం, వేప, పనస, అశోక, అశ్వద్థ, దేవదారు, దేవకాంచన, గోరింట.... నానావిధ ఫల, పుష్ప వృక్షాదులూ వున్నాయి. ఆ వనం మధ్య కోనేరులో అపురూపమైన ఒక తామరపువ్వు వుంది. అటువంటి తామరపువ్వు మరెక్కడా లేదు. ఆ తామరపువ్వుల మధ్య హంసలు వొయ్యారంగా, అటూ ఇటూ ఈదుతూ వుంటాయి. బృందావనంలో అదొక అందమైన దృశ్యం.

ఆ సంధ్యకాంతిలో, యమునానది గర్భంలో ఇసుక తిన్నెలపై రెల్లుదుబ్బులు బంగారు తీగల్లాగ ధగధగా మెరిశాయి. పగలంతా కాసిన ఎండకి వేడెక్కిన నది నీటినీ, ఏటి గట్లనీ, మలయమారుతం శాంత పరచింది. ఏటి నీటి కెరటాలపై, ఆఖరు సూర్యకిరణం వివిధ వర్ణాల్ని కల్పిస్తూ, అలసట మరచి ఆనందంగా ఆడుకుంటోంది. ఆ రోజంతా తేనె తాగి తాగి మత్తెక్కిన తేనెటీగలూ, ఈలపిట్టలూ, తుమ్మెదలూ వాడిపోతున్న పూలచుట్టూ చేరి, కడసారి కౌగిలి ఇమ్మని వేధించాయి. కదంబ వృక్షాగ్రం నుంచి, ఓ చిలుక ప్రేమతో ప్రియుణ్ణి పిలుస్తోంది.

ఆరోజు సంధ్యవెలుగులో యమునాతీరం, బృందావనం, ఎంతో శోభాయమానంగా, స్వర్గతుల్యంగా వున్నాయి. చిలకలు, పావురాయిలు, గువ్వలు మొదలైన పక్షులు మనసారా పాడుకుంటూ ఆకాశంలో స్వేచ్ఛగా విహరిస్తున్నాయి.

బృందావనం నుంచి త్రిభువనాల్ని మోహింపజేసే వేణుగానం ధారావాహినిగా వినవొస్తోంది. ఆ మురళీ నాదాన్ని విని, గోవులు నిశ్చలంగా నిలబడిపోయాయి. నెమళ్ళు పురివిప్పి నాట్యమాడాయి. తమ చెలికాడైన కృష్ణుని కలుసుకోవాలని గోపబాలురు బృందావనంవైపు పరుగులు తీశారు. మురళీ స్వరాల్లో తమపేరే పలికిస్తున్నాడనుకున్నారు

ప్రతిఒక్కరూ. ఆ వేణునాదం గోపాంగనల చెవుల సోకగానే, వారి బాహ్యసంబంధాలు బహు చిత్రంగా తెగిపోయాయి. ఆ మహేంద్ర జాలంలో విశ్వమే ఉయ్యాలలూగింది.

ఆ నాదశరం నారీ హృదయాల్ని సూటిగా తాకడంవల్ల, వారి మనస్సుల్లో ఏవో గత జన్మస్మృతులు రేగాయి. బృందావనం వెళ్ళి, కృష్ణునికలుసుకోవాలని గోపాంగనల హృదయాలు ఆరాటపడ్డాయి. అది అనుల్లంఘనీయమైన ఆహ్వానమైంది.

వశం తప్పిన గోపస్త్రీలందరూ, ఒకరికి కానకుండా ఒకరు — పాలు పితకడం మధ్యలో ఆపి, వాటి లేగల్ని వొదలడం మరచి కొందరూ, పితికిన పాలు కాచక, కాచిన పాలు దాచక నడచిన పడతులు మరికొందరూ; తాము తినక, అత్త - మామలకు, భర్త - బిడ్డలకు పెట్టక పరుగులుతీసిన పడుచులు ఇంకొందరూ — ఆ విధంగా అందరూ అణచుకోలేని చిత్త వికారంతో, మదనోద్దీప్త నయనాలతో బృందావనం చేరుకున్నారు.

ఆ గోపాంగనలు ఎవరికి వారు తామే ముందుగావెళ్ళి, కృష్ణుని కలుసుకుని, అతన్ని తమ స్వంతం చేసుకోవాలనే తొందరలో కొందరు అసందర్భంగా అలంకరించుకున్నారు. కామ వికారంతో, మదనతాపంతో సంయోగవాంఛతో, వొళ్ళుతెలియని ఆవేశంతో బట్టలనైనా సక్రమంగా ధరించని వారు మరికొందరు. కృష్ణునిపై అవ్యాజానురాగంతో గోప కామినులు భయం, సిగ్గూ, ధర్మం— అన్నీ విస్మరించారు.

ఆ సాయంత్రం బృందావనంలో ఎక్కడ చూసినా విచ్చలవిడిగా విహరిస్తున్న గోపాంగనలే! వారందరికీ కృష్ణుడు తానొక్కొక్కడై, గొప్ప శృంగార మూర్తియై, వెలిగిపోతున్నాడు. అవి వారి జీవితాలకే మరపురాని అమృత ఘడియలు.

కృష్ణుడు చాలా చమత్కారంగా మురళి మోగించడం వల్ల, ఏదో మాయాజాలం క్రమ్మినట్లు వ్రేపల్లెలో ఓ వింత వాతావరణం ఏర్పడింది. ఆ దివ్యనాదం అవిరామంగా మోగేకొద్దీ, ఎవరూ ఒకచోట స్థిరంగా నిశ్చలంగా నిలవలేకపోయారు. బృందావనం వెళ్ళి కృష్ణుని కలుసుకోవాలని, అందరు ఆడపడుచులు మాదిరిగా, ప్రతికోడలి హృదయం ఆరాట పడింది. బృందావనంవైపు పరుగులుతీసిన కోడళ్ళను అత్త-మామలు అడ్డగించారు. మరీ మారాం పెట్టిన వాళ్ళను కాళ్ళూ-చేతులు కట్టి, గదుల్లో బంధించారు. అటువంటి నిస్సహాయుల మనసులు ఏకాగ్రమై ఆ రాత్రి గొప్ప సమాధి స్థితిని అందుకున్నాయి.

* * *

మాధవి ఓ పెద్దింటి కోడలు. ఆమె అత్తవారింటికి వొచ్చి ఆట్టేకాలం కాలేదు. కాని, ఆమెకూడా చాలాసార్లు కృష్ణుని పేరు విన్నది. ప్రతి గోపికా కృష్ణుడు తనకు బాగా తెలుసునంటుంది. అతని గురించి అందరూ ఎప్పుడూ ఏదో ఒకటి సంతోషంగా చెప్పుకుంటూనే వుంటారు. మాధవి ఆ సంగతులన్నీ విని, అవన్నీ వాళ్ళకు ఎట్లా తెలిశాయో అడగాలనుకుని మళ్ళా వూరుకుంది. ఆ కృష్ణుడేదో అద్భుతవ్యక్తి అయి వుండాలనుకుంది.

"అసలు ఆ కృష్ణుడెవరు? ఎక్కడ వుంటాడు? ఎలావుంటాడు? అని అనుకుని, "ఎలావుంటాడేమిటి? అంతమంది గోపికల హృదయాలి" ఆకర్షించగలిగాడన్నా, దొంగిలించ గలిగాడన్నా, జయించాడన్నా, మరిపించాడన్నా- అతడు ఆపేరంత మధుర మూర్తయి వుండాలి. ఓ రోజు నేనూ అతన్ని చూస్తాను," అనుకుంది మాధవి.

ఒకసారి మాధవి యమునా నదిలో స్నానం చేసి, ఇంటికివెడుతో ఏటి గట్టున, పొన్నచెట్టునీడన ఒంటరిగా నడిచి వెడుతున్న కృష్ణుని చూసింది. ఆమె అంతకు ముందు అతన్ని చూడకపోయినా, అతనిరూపు, రేఖా విలాసం గురించి ఎంతో విని వుండటంచేత, అతన్ని పోల్చుకో గలిగింది.... అతని తీరు, మామూలు మనుష్యులనుంచి భిన్నంగా వుంది. అతని కదలిక గజరాజగమనంవలె హుందాగా, అందంగా, ఆకర్షణీయంగా వుంది. అతని అడుగుల్లో మనోహరనాట్యం గోచరించింది. ఎవరూ ఆ విధంగా నడువగా ఆమె చూడలేదు. ఆనాడుఅతడు వడివడిగా నడిచాడో, లేక అతనిది మందగమనమో ఆమెకు ఎప్పటికీ అంతు చిక్కలేదు.

మరొకసారి మాధవి కృష్ణుని నీలాటి రేవుదగ్గర చూసింది. ఆమె అతన్ని విస్తుపోయి చూస్తోంటే, తోటివాళ్ళు ఏవో రహస్యాలు మాట్లాడు కుని చిరునవ్వు నవ్వారు. అతడు దేన్నీ లక్ష్య పెట్టకుండా వెళ్ళి పోయాడు.

ఇంకోసారి మాధవి ఇంట్లోంచి వీధిగుమ్మంలోకి వొచ్చేప్పటికి, కృష్ణుడు ఆమె ఇంటి ముందున్న పురాతన శిరీష వృక్ష ఛాయలో నిలబడి, చెట్టుపైనున్న పాలపిట్టను తదేకంగా చూస్తున్నాడు. మాధవి కృష్ణునిచూసి, సంతోషంపట్టలేక, అప్రయత్నంగా "కృష్ణా!" అని చాలా చనువుగా, ఎంతో తెలిసినట్లుగా, ప్రేమగా పిలిచింది. ఆమె పిలుపు అతనికి వినిపించిందో లేదోగాని, అతడు ముఖమైనా తిప్పలేదు. కొంతసేపు నిలబడి, వెళ్ళిపోయాడు.

తన పిలుపులోని అంతరార్థం మాధవికి తెలుసును గనుక, ఆమె అహం దెబ్బతిన్నది. అతడు కనీసం కన్నెత్తి అయినా చూడనందుకు, ఆమె చాలా బాధ పడింది. అభిమానంతో ఆ రోజంతా విలవిలలాడింది

తిండి తినలేదు. నిద్రపోలేదు. అతని గురించి అర్థంలేని ఆలోచనలతో ఆందోళన పడింది.

ఆ విధంగా ప్రతిసారి ఆమె చెంతనుంచి కృష్ణుడు కదలిపోతు న్నప్పుడల్లా, ఆమె హృదయం అతని ప్రేమకోసం వేదన పడింది. చల్లని వెన్నెల్లో, తెల్లని మల్లెపువ్వువలె, నల్లని కొండల మధ్య పాల సముద్రంవలె, లేత ఎండలో మంచు బిందువువలె, మురళీ ధరుడు ఆమె హృదయంలో ప్రవిష్టుడైనాడు.

ఒకసారి మాధవి ఊరుచివర శివాలయం మెట్లమీద, ఒంటరిగా, నిశ్చలంగా, శిలాప్రతిమ మాదిరిగా కూర్చున్న కృష్ణుని చూసింది. అతని దృష్టి దిగంతాలు దాటింది. ముఖమండపం వెలుగునీడల్లో, అతడు ఎంతో అందంగా వున్నాడు. చూసేకొద్దీ ఆమెకు ముద్దొచ్చాడు. ఆ క్షణాన ఆమె గుండె వేగంగా కొట్టుకుంది. అతని సహజసౌందర్యమో, ఒంటరి తనమో- ఏమో ఆమె మనసు చలించింది. వింత అందంతో వెలిగి పోతున్న కృష్ణునికి ఎదురుగా వెళ్ళి నిలబడింది మాధవి. కానీ అతడు ఆమెను చాలాసేపటికిగాని చూడలేదు. అతని చూపు—ఆమె నగ్నంగా వున్నప్పుడు చూసిన చూపు మాదిరిగా వుండటం చేత, ఆమె సిగ్గుతో తటాలున పక్కకు తప్పుకుంది. కృష్ణుని తొలిచూపులోనే మాధవి తొట్రుపడింది.

మాధవి వయసులో కృష్ణుని కంటే పెద్దది కనుక, వెంటనే ధైర్యం తెచ్చుకుని "కృష్ణా! మా యింటికి వొస్తావా?" అని ప్రేమగా అడిగింది.

"నే నెప్పుడూ వస్తూనే వున్నాను. నీ గొడవల్లోపడి నువ్వే నన్ను గమనించలేదు," అన్నాడు కృష్ణుడు చమత్కారంగా.

అతని మాటల్లోని బూటకం, ఆమెకు తెలియక పోలేదు. కాని, అతని మాటలకు ఆమె ఆశ్చర్యపడి చూస్తుంటే, "ఇప్పుడు కాదు,సమయ మైనప్పుడు తప్పక వొస్తాను," అన్నాడు, కృష్ణుడు.

ఆ మాటల అంతర్యం మేమిటో ఆ క్షణాన ఆమెకు అర్థం కాలేదు. కాని, ఆమె నిలువెల్లా కదిలిపోయింది.

అతని నోటినుంచి వెలువడిన ఆ రెండు మాటలూ, ఆమెచెవుల్లో సముద్ర ఘోషలాగ ధ్వనించాయి.

అతని మధురమైన నామం,దివ్యమైన రూపం, ఆమెను ప్రతిసారీ మైమరపించాయి.

* * *

ఆ రోజు సాయంత్రం కృష్ణుని మృదు మధుర వేణురవాన్ని విన్న మాధవి మనసు తియ్యని తలపులతో పులకరించింది. కృష్ణుని కలుసుకోవాలని ఆమె అంతర్యంలో గట్టి ప్రేరణ కలిగింది. ఆమె మనసులో కోర్కె కలిగిన మరుక్షణం, కృష్ణుని మురళీస్వరాల్లో ఆమె పేరు పదే, పదే వినపడింది.

బృందావనంవెళ్ళి కృష్ణుని కలుసుకోవాలనే విరహతాపం, అధికం కావడంతో మాధవి సంసారాన్ని, భావి జీవితాన్ని, సమస్తాన్ని తృణ ప్రాయంగా ఎంచి, యమునా విహారీ, మనోనివాసీ, గోపకామినీ క్రీడా సక్తుడు, వ్రేపల్లెకు గోపాలుడు అయిన కృష్ణుని లీలలు వర్ణించుకుంటూ, అతని మధుర నామాన్ని స్మరించుకుంటూ ఇంటి పనుల్ని యాంత్రికంగా ముగించి, ఆ రాత్రి బృందావనానికి బయలు దేరింది మాధవి.

కృష్ణుడు శృంగార మూర్తియై, ఎన్ని కన్నెహృదయాలను దోచుకున్నాడో! ఎందరు సంసారస్త్రీల మనసులను ఆకర్షించాడో! ఎందరి ప్రౌఢాంగనల ఆలింగనాల్లో తృప్తినెరగక పాదరసంవలె వరిగెత్తాడో! మరెందరి పురుషహృదయాల్లో, ఆరని అగ్ని రగిల్చాడో! ఇంకెందరిలో ఈర్ష్యల్ని, అనుమానాల్ని కలిగించాడో! ఎందరు ప్రియుల కళ్ళల్లో ప్రేమ జ్యోతుల రూపంలో వెలిగాడో!

* * *

బృందావనంలో కృష్ణుని చుట్టూ అనేకమంది గోపాంగనలు మహానురాగంతో నృత్యంచేస్తూ వుంటారనీ, తీరా తాను వెళ్ళేప్పటికి కృష్ణసాన్నిధ్యంలో తనకు చోటు లభ్యమౌతుందో లేదోననీ, లేక తక్కిన గోపికలు తనను అతని దరి చేరనివ్వరేమోననీ, కృష్ణునితో తనకు ప్రధమ పరిచయం గనుక అతడు తననెట్లా తీసుకుంటాడోననీ దారి పొడవునా మాధవి మనసు పరిపరి విధాల సంశయాలతో సతమతమైంది.

మాధవి బృందావనం చేరుకుంది. అక్కడి పచ్చనిచెట్లు, పూల పరిమళం, పక్షుల పాటలు, మనోహరమైన వాతావరణం, బృందావనాన్ని పవిత్ర ప్రేమాలయంగా మార్చాయి. యమునానది మీదనుంచి వీచే చల్లనిగాలి తరంగాలు, దేవలోకంనుంచి ఏవో మధురమైన అనుభవ వార్తల్ని మోసుకొస్తున్నట్లు భారంగా వున్నాయి.

మాధవి ఆగమనానికి బృందావనం, యమునానది, గోవర్ధన పర్వతం, పున్నమి వెన్నెల, చల్లనిగాలి, మురళీస్వరం స్వాగతం చెప్పాయి. ఆమె బృందావనంలో అడుగుపెట్టీ పెట్టగానే ఏ మధుర

స్మృతులు గుర్తుకు వొచ్చాయోగాని. గూళ్ళలోని పక్షులు ఒక్కసారిగా, కిలకిల మన్నాయి.

కోనేరుకు కొంచెం దూరంలో, పొగడచెట్టు మొదట్లో కృష్ణుడు ఒంటరిగా కూర్చుని మురళి వాయించుకుంటున్నాడు. వృక్షాగ్రాల ప్రకాశిస్తున్న చంద్రుని వెలుగు నీడల్లో, అతడు అత్యంత మనోహరంగా వున్నాడు. పాలవంటి పున్నమి వెన్నెల్లో అతని ఇంద్రనీలం ఎంత సౌందర్యంతో వెలిగి పోతోంది. అతనిముద్దైవున్నప్రతీపే ఎంతో ఆకర్షణీయంగా వుంది. భూమండలానికి ఓ దివ్య భూషణంగా, గోకులానికి కల్పవృక్షంగా వ్రేపల్లెలో వెలసిన కృష్ణుడు తనసుందర చంచల వీక్షణాలతో విశ్వసౌందర్యాన్నే దోచుకున్నాడు.

తపనపడే మాధవి హృదయానికి, ఆరాటపడే ఆమె కళ్ళకి, దివ్యమైన ఓమూర్తికనపడింది. ఆకాశంలోని నీలమేఘమే ఆరూపు ధరించింది అనిపించిందామెకు. మాధవి నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ కృష్ణుని సమీపించింది. ఆమె అనుకున్నట్లూ, అనుమాన పడినట్లూ, ఆందోళన చెందినట్లూ అతనిచుట్టూ గోపికలు లేరు. అతడు ఒంటరిగా కూర్చుని మురళి వాయించుకుంటున్నాడు. గాలి, అతని ముంగురులతో ఆడుకుంటూంది. వెన్నెల, అతని ఫాలభాగాన్ని తాకిపరవశిస్తోంది. ఆ దృశ్యం ఆమెను ఉత్తేజ పరచింది. ఆ క్షణాన ఆమె మనసు అతి లావణ్య రసప్రవాహాన తేలి ఆడింది. కృష్ణ సందర్శనంతో ఆమె దేహం, ఆపాదమస్తకం పులకరించింది.

ఏలోకంలోనో విహరిస్తున్న అతని చూపులు అప్రయత్నంగా ఆమెపై నిలిచాయి. అతని పెదవులు కదిలి, మధురంగా నవ్వాయి. ఆ క్షణాన అతని ఆంతర్యంలో ఎటువంటి సంకల్పం కలిగిందో కాని ఆమె నిలువెల్లా కరిగి పోయింది. అతని చూపుతో ఆమెకు కాళ్ళకింది భూమి

పైఆకాశం కదిలిపోతున్నట్లు అనిపించింది. ఆమెకు శ్వాస కూడా దీర్ఘం, భారం అనిపించింది. ఆమె నున్నటి చెక్కిళ్ళమీద నుంచిఆనంద బాష్పాలు జల జలా ధారలుగాజారి, వక్షోగ్రాలమీదపడి, వొడినంతా తడిపాయి. పున్నాగ పువ్వులు తలంబ్రాలుగా ఆమె తలపై రాలాయి.

కృష్ణుని వేణుగానం ఆమె హృదయాన్ని తాకడంవల్ల, ఆమె మనోస్థితి నిస్సహాయమైపోయింది. శరీరం వశం తప్పడంతో ఆమె తనకు తెలియకుండానే కృష్ణుని చేతిలోని మురళి లాక్కున్నది. కృష్ణుడు ఆమెను పట్టుకోబోయాడు. ఆమె అందక చెంపకచెట్టు పక్కకు తప్పుకుంది.

మరుక్షణంలో, బహువిచిత్రంగా పున్నాగ చెట్టుకింద మాధవి మురళీ ధరుని నులివెచ్చని కౌగిలిలో తన్మయత్వం పొందుతోంది. మొదట అది, కల అనుకున్నది. అటువంటి కలలు ఆమెకు అంతకుముందు ఎన్ని రాలేదు? జీవితంలో అంతకన్నా వాంఛించ తగ్గది ఏముంది? ఆ మరు క్షణాన, "బ్రతుకంతా ఇట్లా దివ్యానుభవంతో గడచిపోకూడదా?" అని అనిపించిందామెకు. క్రమంగా ఆమె మనసు, హృదయం, దేహం అతని చేతుల్లో వెన్నలాగ కరిగిపోయాయి.

కృష్ణుడు ఆమె కళ్ళల్లోకి లోతుగా చూస్తూ, హృదయానికి గట్టిగా హత్తుకున్నాడు. పద్మంమీదికి వ్రాలే తుమ్మెద మాదిరిగా, అతడు ఆమె ముఖం మీదికి నెమ్మదిగా వొరిగాడు. ఆమె, అతని కౌగిలినుంచి తప్పించు కోవాలని తంటాలు పడింది. కాని, కాలు కదపలేకపోయింది. కృష్ణు డంటే, ఆమెకెంతో ఇష్టం. ఆమె పెనుగులాట — తన శీలాన్ని కాపాడు కోవాలనీకాదు; అతని చేతుల్లో తాను ఓడిపోతున్నాననీకాదు.

సన్నని సంగీతంలాంటి, గులాబిరేకులవంటి కృష్ణుని పెదవులు మాధవి చెక్కిళ్ళపై నాజూకుగా నాట్యంచేశాయి. అతని మృదుస్పర్శతో

ఆమె వొళ్ళంతా గగుర్పొడిచింది. ఆమెలో ప్రతి జీవకణం మధుర గీతాలాపన చేసింది. ఆమె కళ్ళు తృప్తితో మూతలు పడ్డాయి. ఆమె మనసులో ఎక్కడా దోషం — పాపం— అక్రమం—అన్యాయం—అశ్లీలం—అవినీతి," అనే భావంలేదు. ఆమె స్థితి ఆ క్షణాన ఆత్మార్పణగా వుంది.

మాంత్రికుని చేతిలో కీలుబొమ్మ మాదిరిగా, మాధవి కృష్ణుని చేతుల్లో వుండిపోయింది. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచాయి. చంద్రుడు చెట్ల ఆకుల్లోంచి చల్లగా, మెల్లగా చూస్తున్నాడు. దూరంనుంచి అడవిజాజుల పరిమళం వొస్తోంది. కృష్ణుడు ఆమెను గోముగా లాలిస్తూ, ముద్దు పెట్టుకోబోయాడు. ఆమె చేయి అడ్డుపెట్టి "వద్దు" అంది. ఆమె మాట వినపడనట్లు అతడు ఆమె నడుంచుట్టూ చెయ్యేసి, కోనేటివైపుకు తీసుకువెళ్ళాడు. అతని సాహసం, చనువు, ఆప్యాయత, అనురాగం, ప్రేమ ఆమెనెంతో కదిలించాయి.

మాధవీ — కృష్ణులిద్దరూ పూర్ణవికసిత పుష్పాలవలె, ప్రేమ సౌరభాన్ని వెదజల్లుతూ బృందావనమంతా తిరిగారు.

కృష్ణుడు ఆమె చేతిలోని మురళి తీసుకుని, కోనేరు మెట్లమీదకు వెళ్ళి, నీటిలో ప్రతిబింబిస్తున్న చంద్రుణ్ణి చూస్తూ కూర్చున్నాడు. ఆ త్రిజగన్మోహన నీలకాంతిని మాధవి విస్తుబోయి చూస్తోంది. అతడు ఆమెను కనుసైగతో చేరబిలిచి, వొడిలోకి తీసుకుని, మధువుచిందే ఆమె మృదువైన పెదవులమీద గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు. ముద్దు — మధురమైన ముద్దు. మురళీధరుని మొదటి ముద్దు. ఆ ముద్దే మాధవి జీవన రాగానికి నాందిగీతం పలికింది. మాటల్లో వ్యక్తపరచలేని అమరసుఖాన్ని ఇచ్చిన ప్రథమ చుంబనమది. ఆమె జీవితాన్ని ఆనందనృత్యం చేయించిన

తీయని ముద్దు. ఆమె యవ్వనోద్రేకానికి సంతృప్తినిచ్చిన మధురాతి మధురమైన ముద్దు. జన్మ, జన్మల విరహవేదనకు ప్రతిఫలంగా ఈ జన్మలో లభించిన అద్భుతమైన, అపురూపమైన ముద్దు. ఇంకా ఎన్ని జన్మలకైనా నూతనానుభవాన్నీ, స్వర్గసుఖాన్నీ ఇచ్చేముద్దు, కృష్ణుని ముద్దు.

మాధవిలో అణగివున్న మోహం కృష్ణుని ముద్దుతో ప్రజ్వరిల్లింది. ఆమె దేహంలోని రక్తమంతా చెక్కిళ్ళలో చేరి, మరింత ఎరుపెక్కాయి. ముద్దులో అంత మాధుర్యం వుంటుందని ఆ క్షణం వరకు మాధవికి తెలియదు. అతని ముద్దులో ఎంత చాకచక్యం వుందో! ఆ ఒక్క ముద్దుతో కృష్ణుడు ఆమెను మరింత దగ్గరకు తీసుకుని, మనోహర స్వప్నసీమలందూ, విశాల విశ్వవీధులందూ తిప్పాడు. ఆ క్షణంలో ఆమెకు సమస్తమూ అవగతమైంది. ఆ ముద్దుతో మాధవి పూర్తిగా అతని వశమైంది. అతని ముద్దులో అంత ఆకర్షణ, వశీకరణ, లాలన వుంది. అతడు మదనమనోహరమూర్తి అయితే, ఆమె మోహదేవత అయింది. ఆ నూతనానుభవంతో మాధవి ముఖంలో గొప్ప కాంతి, మనసులో తృప్తి, హృదయంలో శాంతి ఏర్పడ్డాయి.

బృందావనమంతటా చల్లని, తెల్లని వెన్నెలకాంతి. ఆ కాంతికి కళ్ళు తెరిచింది, మాధవి. కృష్ణుడు ముద్దు పెట్టుకున్నప్పుడు అతని కస్తూరి తిలకపరిమళం ఆమెలో నిద్రాణమైవున్న మోహాన్ని రెచ్చగొట్టగా, సంతోషం పట్టలేక, "కృష్ణా! నీ ముద్దులో మధు బిందువు ఒక్కటే కాదు, గొప్ప ప్రజ్ఞకూడా వుంది." అంది.

రావి చిగుళ్ళవంటి ఆమె చెక్కిళ్ళు నిమురుతూ, "మాధవీ! నీ కోసం సాయంత్రం నుంచి ఎదురుచూస్తున్నాను," అన్నాడు కృష్ణుడు.

కృష్ణుడు తనపేరు ఉచ్చరించినప్పుడు ఆకాశం నోరు తెరచుకుని పలికినట్లు ధ్వనించింది మాధవి చెవులకు. తన పేరే గాక, తాను ఆ సాయంత్రం బృందావనం వెళ్ళాలనుకోవడం కూడా అతనికి ఎట్లా తెలిశాయి? అని ఆశ్చర్యపడి, "నేనీరాత్రి నీ దగ్గరకు వస్తానని నీకెట్లా తెలుసు," అని అడిగింది.

"తెలియడానికి ఎట్లా ఏమిటి? నామీద నీకు మనస్సయింది కదా?" అన్నాడు కృష్ణుడు.

"కృష్ణుడు మనసులోని రహస్యాన్ని కూడా తెలుసుకోగలడను కుంటాను. అతన్నించి ఎవరూ, ఏదీ దాచలేరు," అని అనుకుని, "కృష్ణా! నా పేరూ, నేను నీ దగ్గరకు రావాలనుకోవడం నీకెట్లా తెలుసు? ఊహించావా? నేనుకాక ఇంకెవరున్నారు, ఈ వెర్రిగోపికలకు అనే గర్వంనీది. అవునా? కాకపోతే, ప్రతి సంగతి తెలిసినట్లు అంత స్పష్టంగా ఎందుకు మాట్లాడతావు?" అని గట్టిగా అడిగింది.

మాధవి మాటకారి తనానికి కృష్ణుడు లోలోన సంతోషపడి, "మాధవీ, నీ హృదయవాంఛ, నా హృదయంలో అవగతమైంది. అదీ కాక, నువ్వు నాకు ఎప్పటి నుంచో తెలుసు. అప్పటినుంచీ, నేను నీకోసం ఎదురుచూస్తున్నాను. ఆ సమయం ఇప్పటికి ఆసన్నమైంది. ఈ రాత్రి నువ్వు ఇక్కడికి వొచ్చి, నన్ను కలుసుకోకపోతే, జన్మల విరహంతో కాలిపోయేదానివి. ఇంక మనసు అన్యథా పోనీయక ఆనందాన్ని అనుభవించు," అన్నాడు.

కృష్ణుని మాటలు మాధవి హృదయాంతరాళాన్ని సూటిగా తాకడంతో, "అవును, కృష్ణా! నిన్ను కలుసుకోవాలనే నా చిరకాలవాంఛ

నేటికి ఫలించింది. ఇన్నాళ్ళూ నీ పేరు విన్నా, నీ రూపు తలచుకున్నా నీ తలపు కలిగినా ఓ క్షణం ఎక్కడా స్థిరంగా నిలవలేకపోయేదాన్ని. నిన్ను కలుసుకోనిది ఈ జన్మకు ముక్తిలేదనిపించింది. నువ్వు గోపాంగనలతో రాసక్రీడలాడుతూ, పాడుతూ వారి జీవితాలను నీ దివ్య ప్రణయంతో ప్రేమతో పునీతంచేశావని తెలిసి, నాకాభాగ్యం ఎప్పుడు లభిస్తుందా? అనే ఆలోచన నన్ను నిరంతరం దహించేది. ఏకకాలంలో అనేక వేలమంది గోపాంగనలతో నువ్వు క్రీడిస్తున్నావని విని, ఆ మహేంద్రజాలాన్ని కళ్ళారా చూసి, ఆనందించాలని అభిలషించేదాన్ని— ఎంతకీ నిగ్రహించుకోలేని నా మోహమే, నన్ను నీ పాద సన్నిధి చేర్చింది.

“ఏ విధివల్లనో, ఏ వరంవల్లనో, ప్రేమదేవతల కరుణవల్లనో ఈ రాత్రి నా చిరకాలవాంఛ నెరవేరింది,” అంటూ మాధవి సంతోషంతో, సంతృప్తితో కృష్ణుని చెంపల్ని తన చేతుల్లోకి తీసుకుని ముద్దు పెట్టుకుంది.

దూరంనుంచి జెముడుకాకి మూలుగు వినిపించింది. అప్పుడే విచ్చుకుంటున్న పువ్వులు పరిమళాన్ని వెదజిమ్ముతున్నాయి.

క్షణాలు గడిచేకొద్దీ మాధవిలో సౌందర్యతృష్ణ, రసపిపాస, భావోద్రేకం మరింత ప్రజ్వరిల్లి “కృష్ణా! నాకు ఇప్పుడిప్పుడే తెలుస్తోంది నిన్ను పొందాలనే అవ్యాజమైన వాంఛ ప్రతి ఒక్కరిలో ఆరని అగ్నివలె వుంటుందని, నీ దివ్య సుందర రూపం చూసి, మనసు పడక నిలవగలిగిన స్త్రీ అంటూ వుంటుందా, ఈ లోకంలో? ఒక్క స్త్రీలేకాదు? సమస్త ప్రాణికోటి, సర్వకాల సర్వావస్థలయందూ, నీ పొందే కోరుతుంది. అంధకారంలో తళుక్కున మెరిసే మెరుపే, నీ రూపం, నీ

దర్శనం. ఈ రాత్రి నాకా భాగ్యం కలిగింది. ఈ శుభసమయం కోసమే, కోటి సంవత్సరాలనుంచి ఎదురు చూస్తున్నాననిపించింది.

"కృష్ణా! నిన్ను చూస్తోంటే, మహామునీంద్ర సేవితం, నానా చరాచర, నారీ నర రూపం అయిన విష్ణుమూర్తిని దర్శిస్తున్నట్లుంది.

"నువ్వే నా దైవం- నా జీవితం- నా స్వర్గం- సమస్తం నువ్వే. నువ్వు లేనిది నాకు జీవితమే లేదనిపిస్తోంది," అంది, మాధవి.

చుట్టూ చేరిన మబ్బుల్లోంచి తెల్లగా మెరుస్తూ వెలుగు, నీడల్ని ఏర్పరుస్తున్నాడు, చంద్రుడు.మాధవి మనసులో ఆలోచనలు చెలరేగాయి. ఆమె దృష్టి చెదరడం గమనించి, "మాధవీ, ఏమిటి ఆలోచిస్తున్నావు? ఎందుకు వ్యాకుల పడుతున్నావు? అనంతమైన విశ్వంలో, ఆద్యంతాలు లేని కాలంలో, ఎన్నాళ్ళు, ఎంతదూరం ప్రయాణం చేయదలుచుకున్నావు? సర్వబంధాలు తెంచుకున్న తర్వాతనే ముక్తి. దానికి సంసారం గవాక్షం కాదని ఎవరైనా, ఎప్పుడైనా అన్నారా? సంసారాన్ని సాధనగా చేసుకుని తరించిన వారెందరో వున్నారు. నువ్వేమీ విచారించకు. విశ్వాసంతో వుండు. ఎప్పటికి, ఏది లభ్యమైతే దానితో పవిత్ర జీవనం గడుపు" అని జీవిత రహస్యం బోధించాడు కృష్ణుడు.

కృష్ణుని మాటల్లోని అంతరార్థం కలలోలాగ అర్థమైనా, మాధవి మనసు మళ్ళా లోక వ్యవహారం వైపు మళ్ళి, తికమకపడి ఏమీతోచక జేలమై, "కృష్ణా, అవన్నీ నాకేం తెలియవు. నాదొక్కటే ఆశయం, నిశ్చయం. నా ప్రేమ ఎప్పుడూ నీ కోసం నిరీక్షిస్తూ వుంటుంది. కానీ, కృష్ణా! ఇంత చిన్న వయసులో అంత ఆధ్యాత్మికానుభవం నీకు ఎట్లా

కలిగింది? నీ మాటలన్నీ పరమ సత్యాలుగా వున్నాయి. నీ చేష్టలన్నీ చిలిపి తనంగా వున్నాయి. కాని, నువ్వు ముద్దుపెట్టుకున్న మరు క్షణం నుంచీ నాకూ విశ్వ రహస్యాలు తెలుస్తున్నాయి. ఏవో పాత జ్ఞాపకాలు, ఏ జన్మలోనివో సంగతులు గుర్తుకు వొస్తున్నాయి.

"కృష్ణా, ఎవరు నువ్వు? అసలు నేనెవరు? మన ఇద్దరిమధ్యా ఈ ప్రేమ సంబంధం ఏమిటి?

"మనిద్దరం యిలా వుండటం ఇప్పుడేకాదు, ఎప్పుడూ ఇలాగే వున్నాం," అని, "నేనా? నే నెవరో నీకు తెలుసు. నీ కృష్ణుణ్ణి. కాని, ముందు నువ్వెవరవో తెలుసుకో! ఆ తర్వాత మన మధ్య సంబంధం ఏమిటో అంతా స్పష్టంగా తెలుస్తుంది" అని ఆమె కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు, కృష్ణుడు.

దివ్యరూప సందర్శనమైనట్లు మాధవి,కృష్ణునివిస్మయంతోచూస్తూ, చాలాసేపు నిశ్చలంగా నిలబడిపోయింది. ఆమె కళ్ళు జ్యోతుల్లాగ మెరిశాయి. ఆమె చుట్టూ గొప్పకాంతి ఏర్పడింది. ఆమెకు అంతా అయోమయంగా వుంది. ఆమె కృష్ణుని చూసి, తన కళ్ళను తానే నమ్మలేకపోయింది. కృష్ణుడేదో గారడి చేశాడనుకుంది.

కృష్ణుడు ప్రసన్నుడైనాడు. అతని చూపులో ఆమెకు అవ్యాజమైన ప్రేమ గోచరించింది. అతని ఉనికిలో అనిర్వచనీయమైన ఆనందం లభించింది. ఆమె మనసులో ఆరాటం అణిగి, హృదయం శాంతపడింది. ఆమె కళ్ళ వెంట ఆనంద బాష్పాలు రాలాయి. కాల దూరాలకు మించిన అనంతత్వాన్ని దర్శిస్తున్నట్లు నిలబడిపోయిన మాధవిని దగ్గరకు తీసుకుని, "మాధవీ, నేనెవరో ఇప్పుడు నీకు తెలిసింది కదూ?" అని అడిగాడు కృష్ణుడు.

మాధవి చాలా నిదానంగా, నిర్మలంగా, నిశ్చయంగా "కృష్ణా, నువ్వెవరో తెలిసింది. కాని, నేనెవరో నాకింకా తెలియలేదు. కన్ను మూసినా నీ రూపమే కనిపిస్తోంది. నా శ్రవణేంద్రియంలో సదా నీమురళీ స్వరమే మారుమోగుతోంది. సమస్త చరాచరం ప్రేమ స్వరూపంగా దర్శనమిస్తోంది.

"కృష్ణా, నువ్వు నన్నేం చేశావు? లేక, నేనేమై పోయాను? ఆలోచించమనీ, బాధపడమనీ నన్నింకా ఇలా మిగిల్చావా? అన్ని ఆలోచనలకూ ముందు నీ ఆలోచనే వొచ్చింది. అన్ని రూపాల్లో నీ రూపమే కనిపిస్తోంది. అన్ని శబ్దాలలో నీ మురళీ స్వరమే వినపడుతోంది. నాదంటూ ఏమీ మిగల్చకుండా నువ్వు నన్నంతా ఆక్రమించుకున్నావు. సర్వాంతర్యామివై అందరికీ నాథుడవయ్యావు. కృష్ణా! నువ్వు ఒక్కడివే పురుషోత్తముడివి," అంది గద్గద స్వరంతో.

"మాధవీ, ఆందోళనపడకు, నేనున్నాను," అన్నాడు కృష్ణుడు గొప్ప ఓదార్పుగా.

"కృష్ణా, నీ మాటలు నిజమా? నువ్వు ఒక్క నాతోనే వుంటే, ఈ గోపికలందరూ ఏం కావాలి? ఇట్లా ఎందరిని తీసుకుంటావు? నువ్వు నా కంటె చిన్న వాడివి. లోకానుభవంలేక, అట్లా మాట్లాడుతున్నావు. నీ మాట విని, విశ్వసించి, గృహిణినైన నేను నీతో వుండటం ఎట్లా సంభవం?" అన్నది మాధవి. అతని మాటల్లోని నిజానిజాలు తెలియక తికమక పడింది.

సృష్టి నిర్మాణ సమయంలో ఈశ్వరుడు ఈ భూమిని "సంశయము"తో తడిపివుంటాడు. ఆ తడి ఎప్పటికీ ఆరదనుకుంటాను. అదే

మాయ. ఆ మాయ, కర్మరూపం దాలుస్తుంది. ఆ కర్మ ఫలితమే,మాధవి మనసులో ఆలోచనలు, ఆరాటాలు, ఆవేశాలు, ఆవేదనలు, ఆందోళనలు.

ఎంతకీ స్థిరనిశ్చయానికి రాలేకపోతున్న మాధవిని చూసి, "మాధవీ, నన్ను నమ్మి నాశనమైన వాళ్ళులేరు. సందేహించడం, మానవ నైజం. అచంచల విశ్వాసంతో, ప్రతి ఫలాపేక్ష లేకుండా ప్రతిదాన్నీ ప్రేమించు. ఇదంతా సామాన్య సంసార జీవితానికి అలవాటు పడిన నీ మనసులో పుట్టిన వ్యాకులతేగాని, మరేంలేదు. విశ్వాసం ముఖ్యం. నాకు అందరూ సమానమే." అన్నాడు కృష్ణుడు.

అప్పటికే చాలా పొద్దుపోయింది. రాత్రివేళ, ఇల్లు వొదిలి వెళ్ళిన ఇల్లాలి పరువు బూడిద పాలౌతుంది. పెద్దలూ శంకిస్తారు. భర్త బాధిస్తాడు. లోకం, వీపు వెనక నవ్వుతుంది. ఇంటా, బైటా ఆమె గౌరవ, మర్యాదలు మట్టికలసి పోతాయి. జీవితమే సర్వనాశన మౌతుంది. ఆ సంగతులన్నీ తలపుకు వొచ్చి, మాధవి గుండె బరువెక్కింది. మానసికంగా కృంగిపోయింది.

"మాధవీ ప్రేమంటే ఎరుగని కౄరమైన లోకంలో విధివశాన జన్మించిన అబలవు నీవు. నిన్నూ, నీ పూర్వజన్మల పుణ్య ఫలితాన్నీ, కిందటి జన్మలో నీ హృదయ వాంఛని తీర్చేందుకు ప్రేమ దేవతలు అనుగ్రహించి, ఆశీర్వదించి ఈ రాత్రిని ఏర్పాటు చేశారు. కాని, ప్రేమంటూవరిగెత్తిన ప్రతివారిని లోకంహింసిస్తుంది, విసిరిపారేస్తుంది," అన్నాడు కృష్ణుడు.

"అవును కృష్ణా! అవును. ఈ లోకమింతే! నా ఆలోచనలే, నా ప్రారబ్ధ కర్మే నన్ను, నీ నుంచి దూరం చేస్తాయి," అని మాధవి ఇంటి

సుఖం పట్టి, కృష్ణుని వొదిలి వెళ్ళలేక "కృష్ణా!" అని హృదయాంతరాళంలోంచి గట్టిగా పిలిచింది.

"చేతుల్లో వాలిన పెన్నిధానాన్ని జారవిడుచుకునే మానవులు, మూర్ఖులు" అని అనుకున్నాడు. ఆమె వెడుతూ "కృష్ణా," అని ప్రేమానురాగంతో పిలిచినందుకు కృష్ణుడు ఆమె దారికి అడ్డునిలిచాడు.

మాధవి అతన్ని తప్పించుకుని, మారోదారి పట్టింది. ఆ దారినే అతడు అడ్డు తగిలాడు. ఇంకోదారికి వెళ్ళింది. ఆ దారీ కాశాడు. అన్ని దారులూ అయిపోయాయి. ఆమె అలసి పోయింది. ఇంక ఎటూ దారి లేక ఓ చోట నిలిచిపోయింది. ఆమెకెదురుగా కృష్ణుడు నవ్వుతూ నిలబడ్డాడు.

"కృష్ణా ఏమిటీ అన్యాయం? నన్ను ఇంటికి వెళ్ళనివ్వవా? మరీ అల్లరి వాడివై పోతున్నావు. నాదారికి అడ్డు తప్పుకో! ఇన్ని సంగతులు తెలిసిన నీకు, నా ఆపదలు, అవసరాలు తెలియవా? నా కోసం ఘోర ప్రమాదం కాచుకుని వుంది," అని ప్రతిమాలినట్లు అడిగింది.

"వెళ్ళగలవా?" అన్నాడు కృష్ణుడు

"దారి ఇచ్చి, నువ్వు వెళ్ళనిస్తే, వెళ్ళగలను," అంది మాధవి.

మాధవి సహజ సౌందర్యవతి. కృష్ణుని స్పర్శతో ఆమెకళ్ళు మరీ మెరిసిపోతున్నాయి. కాంతికి తెరుచుకున్న ఆమె కళ్ళను కృష్ణుడు మరొకసారిముద్దిడి, దారి ఇచ్చాడు.

సీతాకోక చిలుక వాలిన పువ్వు పులకరించినట్లు మాధవి దేహం, ఆపాద మస్తకం పులకరించింది. ఆమె తన హృదయాన్ని అతనిచెంత వొదిలి, వెనక్కి తిరిగి తిరిగి కృష్ణున్నే చూస్తూ వెళ్ళింది; మాధవి.

కృష్ణుడు తురాయి చెట్టును ఆనుకుని పిల్లంగోవిని వాదనారంభించాడు. ఆ వేణునాదం భరించలేని విరహ వేదనను కల్పిస్తో, మాధవి మనసును వాడిపెట్టి వెనక్కి లాగుతోంది. ఆమె అడుగులు తడబడ్డాయి. కృష్ణ ప్రేమను అర్థం చేసుకునేందుకు ఆమెకు మనస్సే అడ్డు. ఆ మనసు కల్పించే కారణాలే— ప్రపంచం— భర్త, నీతి, ధర్మం.

*  *  *

ఆ దేరోజు రాత్రి. పున్నమి వెన్నెల భూమినంతా సంపూర్ణానురాగంతో చల్లబరుస్తోంది. వేపల్లె పూర్తిగా మాటు మణిగినా, మాధవి భర్త, గోవిందు మాత్రం నిద్రపోలేదు. పూర్వం నుంచీ వారిది మంచి గౌరవ, మర్యాదలుగల సాంప్రదాయక కుటుంబం. ఏ తరంలోనూ మచ్చుకైనా మచ్చలేని వంశం వారిది. కాని, ఆ రాత్రి మాధవి ఎవరికీ, ఏమీ చెప్పకుండా ఇల్లు వొదిలి వెళ్ళిపోయింది.

మాధవి గుణాలు గోవిందుకు ఆదర్శం. ఆమె అత్తింటికే కాదు పల్లె అంతటికీ ఓ వెలుగుగా మెలగుతోంది. భర్త యెడల ఆమె చూపే ప్రేమ, అనురాగం అపారం. అతడు ఆమెను తన ప్రాణానికి ప్రాణంగా ప్రేమించాడు. కాని, కాపరానికివొచ్చిన చాలా కాలానికి ఆమె అటువంటి అఘాయిత్యం చేసింది.

మనసారా ప్రేమించిన భార్య, రాత్రివేళ నిష్కారణంగా ఇల్లు వొదిలి వెళ్ళిపోతే, ఆ సంగతి ఆ భర్త గుండెల్లో బల్లెం పోటుకాదా? గోవిందు అనుమానమంతా మాధవి బృందావనం వెళ్ళివుంటుందని. లేదా కృష్ణుడే ఆమెను మాయంచేసి, దారి తప్పించి వుంటాడని. కృష్ణు

దంటే గోవిందుకి పేర్మే. కాని, మాధవి తన వంశ మర్యాదనీ, గొప్ప తనాన్నీ అందరి ముందూ చులకన చేసిందనీ, తనను అలక్ష్యం చేసి వెళ్ళిందనీ ఆమెపై కోపం. ఇంటా, బైటా తన బ్రతుకు లోకువైపోతుం దని చాలా బాధపడి, తలపీక్కుని, తనను తిట్టుకుని భార్యనూ తిట్టాడు. తెల్లవారిన తర్వాత కృష్ణని సంగతి గట్టిగా తేల్చుకోవాలనుకున్నాడు. ఆడపిల్లల్ని ఎట్టా గోతిలో పడేస్తున్నాడో అందరికీ చెప్పి, అతన్ని ఏ విధంగానైనా ప్రేవల్లె నుంచి శాశ్వతంగా తరిమెయ్యాలను కున్నాడు. నిద్రపట్టక ఇంటి దక్షిణ వైపు వరండాలో నులక మంచం మధ్య కూలబడ్డాడు.

బాగా పొద్దుపోయింది. వరండా తూర్పు గుమ్మం దగ్గర రాతిచప్టా మీద ఓ నల్లని నీడ మెల్లగా కదిలి, గోవిందు కాళ్ళ దగ్గర ఆగింది. ఆ నీడ ఏదోకాదు. అతని భార్య మాధవి.

మాధవి, ఆ సాయంత్రం వరకు గోవిందు ప్రేయసి. ఆ తర్వాత అతని దృష్టిలో, ఆమె నరరూప రాక్షసి, వ్యభిచారి, కులట, పాతకి, కామపిశాచి.

ఓ రెప్పపాటుకాలం మాధవి— గోవిందు ఇద్దరూ ఒకరి కెదురుగా ఒకరు నిశ్చేష్టులై నిలబడ్డారు. వారి నోట మాటలేదు, అతని ఉగ్రరూపం చూసి మాధవి భయపడలేదు. గోవిందు ఆవేశం ఆపుకోలేక, "ఎక్కడికి వెళ్ళావ్?" అని గట్టిగా హుంకరించాడు.

మాధవి మాట్లాడలేదు. రాయిలాగ మౌనం దాల్చింది. ఆమె వంచిన తల ఎత్తలేదు. ఒక్క అడుగు కదపలేదు. అసలు ఆమెదృష్టే అక్కడ వున్నట్లులేదు. ఎంతకీ ఆమె సమాధానం చెప్పకపోయేప్పటికి గోవిందుకు రోషం వొచ్చి, ముందు వెనుకలు ఆలోచించకుండా ఆమెను

చావగొట్టాడు. అయినా ఆమె నోరు విప్పి మాట్లాడలేదు. కన్నీరు పెట్ట లేదు. అట్లానే నిలబడి వుంది. ఆమెలో బాధ, భయం, పశ్చాత్తాపం ఏమీ లేదు. ఆమె నిశ్చలత్వం చూసి భరించలేక స్పృహ తప్పేవరకు ఆమెను మళ్ళా కొట్టాడు.

మాధవి అబల. స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలులేని గృహిణి. భర్త చేతిలో కీలుబొమ్మ. శీలం పోగొట్టుకున్నదన్న గృహిణికి ఇంటా, బైటా స్థానం శూన్యం. ఆమె అంతర్యాన్ని అవివేకంతో చూడక పిచ్చికుక్కను తరిమినట్లు తరుముతారు, బంధు— మిత్రులు. లోకులు, కాకులుపొడిచినట్లు పొడుస్తారు. ఆమె అంత చులకన అవుతుంది. అందుకే స్త్రీ అంత లోకువ, లోకంలో.

మాధవికి తెలివి రాకముందే, గోవిందు ఆమెను తీసుకుపోయి, పడమటింట్లో పడుకోబెట్టి, బైట గొళ్ళెం పెట్టాడు. అతడు ఏం చేసి భార్యమీద కసి తీర్చుకోగలడు? ఆమెను భార్యగా స్వీకరించటానికి అతనిలో ఎన్నో అభ్యంతరాలు పుట్టుకొచ్చాయి. ఆమెను నిరాకరించో హత్యచేసో అతడు సంఘంనుంచి తప్పించుకోలేడు. "చివరికి నీపొగరు అణిగిందా?" అని అందరూ హేళన చేస్తారని అతనికి భయం.

అంత వివేకవంతురాలైన మాధవి, రాత్రివేళ ఎవరికీ, ఏమీ చెప్పకుండా నిష్కారణంగా ఇల్లు వొదిలి వెళ్ళిందంటే, అందులో ఏదో నిగూఢమైన కారణం వుండి వుండాలనుకున్నాడు, గోవిందు. కాని, ఎంత ఆలోచించినా ఆ రహస్యమేమిటో అది అతనికి అంతు చిక్కలేదు. అసలు రహస్యం తెలుసుకుని మాత్రం ఏం ప్రయోజనం! అంతా సర్వ నాశనం అయిన తర్వాత? అతనివివేకమూ ఎంతో సేపు నిలవలేదు.

* * *

చాలా సేపటికి మాధవికి స్పృహ వొచ్చింది. చుట్టూ చూసింది. చీకటిగా వుంది. జీవితమే అంధకారంగా తోచింది. జరిగినదంతా స్ఫురణకు వొచ్చింది.

జీవితాంతం భరించేవాడు భర్త. జీవితానికి వెలుగు ఇచ్చినవాడు కృష్ణుడు. బ్రతుకులో భాగం చేసుకునేవాడు భర్త. బ్రతుకు భారం కాకుండా, ఆ బ్రతుకులో లోతులు, విలువలూ చూపించి, అమరసుఖాన్ని ఇచ్చినవాడు కృష్ణుడు. ఈ కృష్ణనామమే, కృష్ణరూపమే, కృష్ణభావమే మాధవి లోకమైపోయింది. కొన్ని గంటల్లో ఆమె స్థితి అద్భుతంగా మారిపోయింది.

కాని, లోకపరంగా కృష్ణుడు పరపురుషుడు. అతడు ఎంతటి వాడైనా, అతడెవరైనా, అతనితో ఎటువంటి సంబంధాన్నీ, ఎవరూ అంగీకరించరు. పైగా అశ్లీలమని, అపరాధమని నిందిస్తారు, నిరసిస్తారు. వెలివేసి, హీనంగా చూస్తారు. కాని, కృష్ణుని కలుసుకున్న మరుక్షణం నుంచీ, మాధవి హృదయం పూర్తిగా అతని అధీనమైపోయింది.

గోవిందుకు నిద్రపట్టక, మాధవి వున్న గదిలోకి తలుపు సందు లోంచి చూశాడు. చీకటిగా వుంది. ఆమె ప్రవర్తన జ్ఞప్తికి వొచ్చి, “మాధవీ, నువ్వు సుగుణాల రాశివి. నువ్వు ఈ విధంగా ఎందుకు మారావు? మృత్యువు నిన్ను నా నుంచి దూరం చేసినా, నేనింత బాధపడే వాడిని కాదు. నా మనసులో ఎప్పుడూ మధురంగా మెలిగే నీ అందాలు, అనురాగాలు, జ్ఞాపకాలు నా ప్రాణాన్ని పిండేస్తున్నాయి. నా కుడిభుజం అకస్మాత్తుగా తెగిపోయినట్లుగా వుంది. నా ఆనందమంతా క్షణంలో ఊడ్చుకుపోయినట్లుగా, నా జీవనం, మృత్యుమయంగా, నా వెలుగు,

చీకటిగా మారిపోయింది. నా వైభవమంతా కూలిపోయింది" అని అతని మనసు గిలగిలలాడింది.

ప్రణయలీలా విలాస, వినోద, సామ్రాజ్ఞయిక చక్రవర్తి- కృష్ణుడు ముద్దు పెట్టుకున్న ప్రతి శరీరావయవం మళ్ళా, మళ్ళా పులకించడంచేత, మాధవి మనసు వికలమైంది. మోయించని మురళీగానం ఆమె చెవుల సోకి, ఆమెలోని జీవశక్తిని మేల్కొల్పి ఉత్సాహపరిచింది. ఆమెలో నవచైతన్యమే మేల్కొన్నది. కృష్ణుని రూపు రేఖా విలాసాలు, మధుర భాషణలు, మృదుస్పర్శలు, మోహనజనకమైన ముద్దులు తలచుకుని మాధవి మురిసిపోయింది. తన అదృష్టానికి తనను తానే అభినందించు కుంది. ఆ ఆనంద పారవశ్యంలో భర్త కొట్టిన దెబ్బల బాధా, లోకాప వాదూ అన్నీ మరచింది. కృష్ణునిలో ఐక్యమైపోయింది. బృందావనాన్ని, యమునా నదిని, పున్నమి వెన్నెలను అన్నింటినీ ఆ చీకటి గదిలో మరొకసారి మనోనేత్రంతో దర్శించింది.

మాధవి తలపులో ఒక్కసారిగా వలపులన్నీ పులకరించి, మొలక లెత్తాయి. మొలకలెత్తిన మరుక్షణంలో చిగురించాయి. వొళ్ళు తెలియని ఆవేశంతో కృష్ణుడు తన చెంత వున్నట్లు భావించి, ఏవేవో సంగతులు బిగ్గరగా మాట్లాడనారంభించింది.

మాధవి వున్న గదిలోంచి మాటలు వినిపించాయి. ఒక్కమాటా గోవిందుకు అర్థంకాలేదు. అతనిలో ఎన్నో సందేహాలు చెలరేగాయి. ఎవరో అమానుష వ్యక్తి, తన కన్ను కప్పి, లోపల ప్రవేశించా రనుకున్నాడు. భార్యపై అనుమానపడ్డాడు. ఆమెకు పిచ్చి పట్టిందను కున్నాడు. పిచ్చి కాకపోతే, పిశాచమైనా కావాలనుకున్నాడు. గోవిందు తలుపు దగ్గరకు వెళ్ళి, మాధవిని పిలిచాడు. జవాబు లేదు. తలుపు

తట్టాడు. తెరవలేదు. మాధవి గడియవేసిన జాడలేదు. అతనికి అనుమానం తీరక మళ్ళా తలుపు సందులోంచి చూశాడు. చీకటిగా వుంది. అంతా అగమ్యగోచరంగా వుండటంతో, "ప్రభూ! తెలిసి నేనే పాపం చేయలేదు. నాకు ఎందుకింత దారుణమైన శిక్ష విధించావు? ఘోరమైన విపత్తు నాకెందుకు తెచ్చిపెట్టావు? గుండెల్లో కుంపటి వంటి చిచ్చు ఎందుకు పెట్టావు? ఏ కారణానికి నా గృహం విచ్ఛిన్నమైంది ప్రభూ?" అని ఎంతో విచారించాడు.

గది లోపల మాధవి మోకాళ్ళమీద కూర్చుని చేతులెత్తి నమస్కరిస్తూ, "ప్రభూ, ఎందుకు నాకీ నిర్బంధం? కృష్ణునికీ, నాకూ ఈ సంబంధాన్ని ఎందుకు కల్పించావు? అసలు మా మధ్య ఈ అనుబంధ మేమిటి? ఎందుకు ఇదంతా జరిగింది? ఇది నా ఆశా? ప్రయత్నమా? లేక, నీ నిర్ణయమా ప్రభూ?

"ఇప్పుడు నేనేం చెయ్యను? అటు భర్త, ఇటు కృష్ణుడు. ఎవరిని నిరాకరించను? కృష్ణుని మరచి నిలవలేను. ప్రేమించే భర్తను వొదిలి పోలేను. ప్రభూ, ఏమి నీ ఆజ్ఞ?

"ఆ మాయాలోకం నుంచి, ఈ వాస్తవానికి రావడానికి అనేక కారడవుల్లోంచి పయనించి, క్రూరమృగాల బారినుంచి తప్పించుకుని, అగాధ సముద్రగర్భాలను దాటి, ఎత్తయిన పర్వతశిఖరాలను అధిరోహించి, కాలాగ్నిలో కాలి, బూడిదై వొచ్చాను. ఇప్పుడు నాకు వెనక తోవలేదు.

"జీవితమంతా భర్తసేవలో గడుపుతానని అమాయకంగా అగ్ని సాక్షిగా వివాహంనాడు ప్రమాణం చేశాను. మధ్యలో కృష్ణుడు వొచ్చాడు. నా జీవిత గమ్యాన్నే మార్చాడు. ఏ క్షణాన కృష్ణుని కలుసుకున్నానో,

ఆ క్షణంనుంచి నాకు శాంతి, విశ్రాంతులు లేవు. కృష్ణనామమే దివ్య గానమై నా చెవుల్లో నిరంతరం మారుమోగుతోంది. కళ్ళెం జారిన గుర్రం మాదిరిగా, దారం తెగిన గాలిపటంవలె, ఆకాశంలో మేఘం రీతిగా నా మనసు చెదిరిపోతోంది— ఎటోకాదు, కృష్ణ పాదసన్నిధికి. వేవేగంగా పోతోంది. ఇంక నిలపడం నా తరంకాదు.

"కృష్ణుడు, గొప్ప శృంగార మూర్తి. లీలామానుష దేహధారి. నేనో? సామాన్య గోపికను. అతను కోరితే, దేవ-గంధర్వ-కిన్నెరలే దిగివొస్తారు. అయినా అతడు నన్నంతగా ప్రేమిస్తున్నాడంటే, అది నా పూర్వజన్మ సుకృతమై వుండాలి. లేకపోతే, కృష్ణ ప్రేమను పొందే అర్హత సంపాదించడం అసాధ్యం.

"ఈ సాయంత్రం వరకు భర్త తప్ప బైట ప్రపంచం తెలియని దానిని. సంసార సుఖం తప్ప, ప్రేమానుభవం లేనిదానిని. పరపురుషుణ్ణి చూస్తే పాపమన్న సంగతీ నాకు తెలియదు. కాని, ఇప్పుడు అన్యమనస్కు-రాలిని. కృష్ణుని కలుసుకున్న తర్వాత నా పాపాలు, దోషాలు అన్నీ తుడిచిపెట్టుకు పోయినట్లుగా వుంది. కృష్ణుడు ముద్దు పెట్టుకున్న తర్వాత, నాలో ఏ వాంఛలూ మిగలలేదు. ఆలోచిస్తే, అతడొక్కడే పురుషుడనిపిస్తోంది.

"నా మనసు ఇప్పుడు మధురమైన ఊహలతో తేలి ఆడుతోంది. హృదయం విశాలంగా విస్తరించినట్లుంది. నా కళ్ళు దివ్యకాంతిని వెతుక్కుంటున్నాయి. నా చెవులు మురళీ స్వరంకోసం వేచివుంటున్నాయి. కృష్ణుని నున్నని మెడను కావిలించుకోవాలని నా చేతులు కోరిక పడుతున్నాయి. కాళ్ళు, బృందావనానికి ప్రయాణమౌతున్నాయి.

"ఆ మోహనమూర్తి నా కళ్ళల్లోకి గుచ్చి, గుచ్చి చూస్తాడు. "మాధవీ, నన్ను నమ్మలేవా?" అన్నట్లు. అతని కథలు వింటే, అంతా దగాగా కనిపిస్తుంది. అతని సుకుమారవదనం చూస్తే, ఒక్క కృష్ణుణ్ణే విశ్వసించాలనిపిస్తుంది. అతని మాటలు విన్న తర్వాత, మౌనమే గొప్పదనిపించింది. అతనితో ప్రేమ సంబంధాన్ని ఎట్లా తెంచుకోగలను, ప్రభూ ?

"ప్రభో! అది నా తరంకాదు. ఆ మార్గమేదో నువ్వే చూపాలి. లోకం ఇరుకు, ముకికి అనిపిస్తోంది. నన్ను ఎవరో బంధించినట్లు, కొట్టుమిట్టాడుతున్నాను. స్వేచ్ఛకోసం గిల, గిల లాడుతున్నాను. ప్రభో, నన్ను బంధ విముక్తురాలను చెయ్యి. ఇన్నాళ్ళూ కష్టపడి కట్టుకున్న నా వ్యక్తిత్వపు రాతికట్టడాలన్నీ, కృష్ణ స్పర్శతో కూలిపోయాయి. ఇంక ఏదీ ఆలోచించలేకుండా వున్నాను.

"ఈ సాయంత్రం వరకు చీకట్లో వుండి; ఈ రాత్రే, వెలుగులోకి వొచ్చాను. ఈ మధురానుభవం కలో, వాస్తవమో, లేక భ్రాంతో తెలియకుండా వుంది.

"కృష్ణుని కలుసుకున్నప్పటినుంచీ ధర్మాధర్మాలు నిర్ణయించే లోక జ్ఞానం నాలో నశించింది. భర్త, సంఘం, సంసారం, ఏవీ నాకు పట్టకుండాపోయింది. ప్రభూ, నాకు ఏది దారి? ప్రియుడా ? భర్తా ? ఈ క్షణాన నా జీవనమార్గం రెండుగా చీలింది. ఒకటి కృష్ణుడు, రెండు భర్త. నేను ఏ దారిన ప్రయాణం సాగించాలో నిర్ణయించుకోవలసిన చివరి సమయం ఆసన్నమైంది. సూర్యుడికి ప్రకాశాన్ని, చంద్రుడికి సౌందర్యాన్ని, పువ్వులకు పరిమళాన్ని ప్రసాదించిన ప్రభూ, నాకూ దృష్టినీ, జ్ఞానాన్నీ ప్రసాదించు," అని బృందావనంలో తటస్థపడ్డ దివ్యానుభవాన్ని పరమేశ్వరునికి నివేదించుకుంది మాధవి.

మాధవి గదిలో బిగ్గరగా "కృష్ణా! కృష్ణా!" అని అనడం గోవిందు విన్నాడు. అతడు అనుకున్నంతా జరిగింది. కోపంతో మాధవిని గట్టిగా పిలిచాడు. తలుపు తట్టాడు. జవాబు లేదు. తలుపు సందులోంచి చూశాడు. కళ్ళు మిరిమిట్లు గొలిపే దివ్యకాంతితో గది నిండివుంది. అటువంటి కాంతి అతడు అంతకుముందు ఎన్నడూ చూడలేదు. మాధవి మంత్రాలు, తంత్రాలు నేర్చిన నెరజాణ అనుకున్నాడు. మనసు కలవర పడుతున్నా, గుండె నిబ్బరం చేసుకున్నాడు.

మాధవి కళ్ళు జ్యోతుల్లాగ వెలుగుతున్నాయి. ఆమె చెంత ఎవరో ఒక వ్యక్తి కూర్చుని వున్నారు కాంతిరూపంలో. అతడు తనకు తెలిసిన కృష్ణుడే అనుకున్నాడు గోవిందు. కాని, ఎట్లా సంభవం ? ఆ దృశ్యం అతనికి కలలోలాగ కనుపించింది. తలుపు తెరవమని గోవిందు అరిచి పిలిచాడు. మాధవి తలుపు తెరవలేదు, సమాధానం చెప్పలేదు. చేసేదిలేక అతడు ఓ దుడ్డుకర్ర పట్టుకుని గుమ్మం ముందు కూర్చున్నాడు. కాని, బహు చిత్రంగా అతనికి ఎన్నడూ ఎరగని నిద్ర ముంచుకొచ్చింది. ఎంత ప్రయత్నించీ అతడు నిద్ర ఆపుకోలేకపోయాడు.

*  *  *

మాధవి కృష్ణుని చెంపల్ని నిమురుతూ, "కృష్ణా, తలుపులన్నీ మూసేవున్నాయి. నువ్వు లోపలకు ఎట్లా వొచ్చావు?" అని ఆశ్చర్యంతో అడిగింది.

"ఇంటి తలుపులే మూశారుకాని, నీ హృదయ కవాటం తెరిచే వుంది కదా?" అన్నాడు కృష్ణుడు చమత్కారంగా.

"కృష్ణా! నీ వన్నీ మాయమాటలు. లోపలకు ఎట్లా వొచ్చావో నిజం చెప్పు? ఎవరైనా చూస్తే, నా బ్రతుకు ఏమౌతుందో తెలుసా? ఎందుకింత సాహసం చేశావు?" అంది మాధవి, నిందా పూర్వకంగా.

"నేను నిజమే చెపుతున్నాను, మాధవీ! నేను నీ లోంచేవొచ్చాను. నాకు ఇంకోదారి తెలియదు. ఎవరైనా చూస్తే, ఏమౌతుంది? నేనుండగా నీకు భయమెందుకు? నన్ను కలుసుకోవాలని ఇన్నాళ్ళూ మధనపడి, ప్రేమకోరిన త్యాగానికి నిలబడి, ప్రతిఫలంగా నన్ను కలుసుకున్నావు. కలయికేకష్టం. ఇంకా వియోగప్రసక్తి లేదు," అన్నాడు కృష్ణుడు.

కృష్ణుని మాటలకు మాధవి కళ్ళు చెమ్మగిల్లాయి. ఓ క్షణంఅతన్ని నిదానించి చూసి, "కృష్ణా, ఒకవేళ నేను ఏ కారణం చేతనైనా నీ దగ్గరకు రాలేక పోయాననుకో, అప్పుడు నువ్వు నన్ను మరచిపోతావా? ఈ నూతనానుభవంవల్ల నా మనసు వ్యాకులంగా వుంది. ప్రతి చిన్న విషయానికీ వూగిపోతున్నాను. నాకు వేరు చూపు, మాట, తలపు, ఏమీ లేకుండా చేసి, ఒకరోజు సూర్యాస్తమయవేళ.......... నువ్వు నన్నువొదిలి ............ ఏ గోపిక వొడిలోనైనా............" అంటూ మాధవి అతని వొడిలో వాలిపోయింది. స్త్రీ, ప్రియుణ్ని కష్టపెసే విధం చూసి కృష్ణుడు నవ్వుకున్నాడు. అతడు ఆమె నున్నటి పాలభాగాన ముద్దుపెట్టుకున్నాడు. ఆమె చాలా తృప్తిగా కళ్లు మూసుకుంది.

కృష్ణుని ప్రతిమాటా వాడిగా, సూటిగా మాధవి హృదయాన్ని తాకాయి. అతని మాటలకు ఆమె ఆశ్చర్యపడుతో, "అట్లా నిబ్బరంగా మాట్లాడగల దక్షత ఎవరికి వుంటుంది?" అని అనుకుని, ఎవరీకృష్ణుడు? ఇతనికీ, నాకూ ఏమిటీ సంబంధం? ఇదంతా కలా? నిజమా? అనే ఆలోచనలో పడింది.

కృష్ణుడు ఆమె ఆలోచనల్ని గ్రహించి, "మాధవీ, ప్రీతిదాన్ని ఎందుకు సందేహిస్తావు? ప్రేమ మార్గం నుంచి పిరికిదానివలె వెనక్కి పారిపోతావా? ప్రతి ఒక్కరికీ ప్రేమే జీవితాశయం కావాలి.

"నువ్వు ధరించిన బట్టలు, ఆభరణాలు; నీ దేహ సౌందర్యం, యౌవనం. నీనీతి - ధర్మం, పత్నీత్వం- అన్నీ నిరుపయోగం. ఎందుకంటే అవన్నీ క్షణికం- ప్రేమ ఒక్కటే శాశ్వతం," అన్నాడు.

మాధవి సిగ్గుతో తల వొంచుకుని, "కృష్ణా! ప్రేమంటే ఏమిటో ఇప్పుడిప్పుడే తెలుస్తోంది. నీ నుంచి పొందిన ఆనందానుభవం, నిన్ను గురించి వూహించిన, నా ఆలోచనల కళ్లు తెరిపించాయి. ఈ నాడు నేను నీ ముందు బేలనై నిలబడ్డాను. నా దివ్య ప్రణయంలో కొత్తపాఠాలు నేర్చుకున్నాను. నీ శృంగార చేష్టలు నన్ను మైమరపించాయి. మధురమైన నీ వేణుగానానికి లయగా నా యౌవనోద్రేకం నృత్యం చేస్తోంది. సమస్తమూ ప్రేమాగ్నిలో దగ్ధం కావడమే మార్గమనిపిస్తోంది. నిన్నూ, నీ ప్రేమనూ అర్థం చేసుకుని, అనుభవించి ఆనందించడానికి ఈదేహమే అడ్డు, అనిపిస్తోంది. రాగరంజితమైన నీ రసికత్వంతో సమంగా స్పందించలేక, నా దేహం కొట్టుమిట్టాడుతోంది. ఈ విరహాగ్నిని ఎట్లా భరించను? ఏ మాత్రం విరహం, వేదన లేకుండా సృష్టిలో ఈ ప్రేమ కలాపం ముగియదా కృష్ణా?

"ఇన్నాళ్లూ ఎవరి ఆగ్రహానికి గురి అవుతానని భయపడి నీ దగ్గరకు రాకుండా ఆగిపోయానో, ఈనాడు వారి ముందు స్వేచ్ఛగా వున్నాను. ఇన్నాళూ, నన్ను ఏ జీవితం నిన్ను చేరకుండా చేసిందో, ఆ జీవితం ఇప్పుడు నీ పాదాలముందు పడి ధన్యమైంది," అంటూ మాధవి కృష్ణుని పాదాల మీద వాలింది, ఆత్మార్పణగా.

* * *

ఆదేరోజు రాత్రి. మాధవి-కృష్ణులిద్దరూ బృందావనంలోవున్నారు. అక్కడకు ఎట్లా వెళ్ళింది మాధవికి ఏ మాత్రం తెలియదు.

రాత్రంతా నక్షత్రాలతో క్రీడించిన చంద్రుడు అలసినట్లు కనబడుతున్నాడు. యమునా నదీ కెరటాలపై పున్నమి వెన్నెల నాట్యంచేస్తోంది. భూదేవి గాఢ నిద్రలో వుంది. అప్పుడే పూసిన కొన్ని పువ్వులకు వనదేవతలు రంగులు అద్దుతూ, చివరి నాజూకు నొక్కులునొక్కుతున్నారు. పచ్చగా, మెత్తగా పెరిగిన గరిక మీద, తెల్లని— నల్లని నాగుపాములు పెనవేసుకుని ప్రణయప్రగాఢ పరిష్వంగంలో పరున్నట్లు, మాధవీ-కృష్ణులిద్దరూ పడుకున్నారు. పైనుంచి పున్నాగ పువ్వు పడ్డప్పుడల్లా మాధవి వొళ్ళు పులకరించేది. ప్రతి గగుర్పాటుకీ కృష్ణుడు ఆమెను ముద్దు పెట్టుకునేవాడు. ఆ విధంగా వారిద్దరూ చాలా సేపు మన్మధక్రీడలోమునిగిపోయారు. పూల పరిమళంతో కలిసి, వారి ప్రేమ సౌరభం వనమంతా వ్యాపించింది.

చంద్రుడు పశ్చిమానికి జరిగాడు. కృష్ణ-మాధవి ఇద్దరూ వనమంతా విహరించి కోనేటి నీటిలో ప్రతిబింబిస్తున్న చందురిణ్ని చూస్తూ, పొగడచెట్టుకింద కూర్చున్నారు.

దూరాన గచ్చపొదలోంచి ఓ కుందేలు అకస్మాత్తుగా బైటికి దూకింది. దాని చప్పుడుకు నెమళ్లు భయపడి గట్టిగా అరిచాయి. వాటి అరుపులతో వనమంతా మేల్కొన్నది. మాధవి మనసులో ఆలోచనలు రేగాయి.

"కృష్ణా, ఈ రాత్రి ఏ కరుణ దేవతలో నా చెవిదగ్గర చేరి, విశ్వ రహస్యం చెప్పి, నా మనసును ఉద్రేకపరచి, నీ దగ్గరకు పంపించారు. ఆ క్షణాన నువ్వు నన్ను తీసుకోకపోతే నా బాధను, అంధకారాన్ని, విరహాన్ని, నిరాశను, నిర్జీవత్వాన్ని, అభిమానాన్ని ఎట్లా భరించి జీవించ గలుగుదును? సెలయేళ్ళకు తమ ప్రియుడు, సాగరుడున్నాడు. పువ్వులకు తుమ్మెదలు వున్నాయి. చకోరానికి చంద్రుడు వున్నాడు. నాకు? నువ్వు తప్ప ఇంకెవరున్నారు?" అన్నదిమాధవి దీనంగా.

అక్కడనుంచి వారిద్దరూ రాధామనోహరి-మాలతి పెనవేసుకున్న పందిరి కిందకు వెళ్ళారు. వారికెదురుగా దేవకాంచనచెట్టు విరగపూసి వుంది. దాని వెనక వెదురుపొద పక్కన గోరింట,కదంబం చెట్లున్నాయి. ఆ చెట్ల ఆకుల్లోంచి చంద్రుడు చాలా అందంగాకనిపిస్తున్నాడు. చంద్రుణ్ణి చూస్తో, "కృష్ణా! ఇట్లా నీ కోసం విరహపడి, మధనపడి విధినీ, లోకాన్నీ తిడతానుకానీ, అసలు నీ ప్రేమను పొందిన నా జీవితం ఎంత ధన్యమైనదో, ఎంత ఔన్నత్యాన్ని పొందిందో, ఎంత ఆనందాన్ని అనుభవించిందో— అసలు నేనెంత అదృష్టవంతురాలినో ఒక్కసారైనా ఆలోచిస్తానా? అందాన్ని, ఆనందాన్ని, ప్రేమను, ప్రణయాన్ని, మోహాన్ని శృంగారాన్ని— వాటి అంచుల వరకు నీ నుంచి రుచిచూసి, అనుభవించిన నేను; ఈ బాధా, ఈ వియోగం, ఈ విరహం ఎంత నన్ను నలిపి, చంపి, కాల్చి, భస్మం చేస్తున్నా— జ్వలించే నీ ప్రేమలో నా జీవితం ప్రజ్వలిస్తోనే వుంది" అంటూ మాధవి అతని ముఖంవంక తదేకంగా చూస్తూ, "నీ రూపాన్ని ఆరాధిస్తున్నంతకాలం, నీ ప్రేమను అనుభవిస్తున్నంతకాలం నేను నవజీవనాన్ని పొందుతాను. ఎన్ని ఆపదలు- ఎన్ని అపవాదులు- అనుమానాలు— అవమానాలు- అభాండాలు- పెను తుఫానులాగ నా చుట్టూ చెలరేగినా నిర్లక్ష్యంగా, నిర్భయంగా, నిశ్చలంగా

నిర్మలంగా జీవిస్తాను, సమస్తాన్ని సహృదయంతో స్వీకరిస్తాను. అన్ని బాధల్ని సంతోషంతో భరిస్తాను.

"కాని, నాకు కావలసింది, నువ్వు. ఒక్కనువ్వే. ఈ దేహంతో నిన్ను స్పృశించగలనుకాని, నీ హృదయాన్ని శాశ్వతంగా ఎట్లా పొందాలో తెలియడం లేదు. నువ్వు నన్ను తీసుకోకపోతే, ఈలోకమే, ఈ జీవితమే శూన్యమై పోతుంది; నాకు. ఈ ఒక్కరాత్రి అనుభవమూ, కలే అవుతుంది.

"ఈ పూర్ణ వికసిత పుష్పంలో ఇన్నాళ్ళూ నిశ్చలంగా, నిర్మలంగా' నిగూఢంగా దాగివున్న మధువును ఎప్పుడు, ఏ తుమ్మెదవొచ్చి ఆస్వాదిస్తుందా? అని ఎదురు చూశాను. ఈ రాత్రితో నా ఆశ, ప్రయత్నం పరిపూర్ణత చెందాయి.

"ఎంత సమర్థించుకోబోయినా, ఎంత నాకు నేను చక్కబెట్టుకోబోయినా, ఓ క్షణం కూడా నీ ధ్యాస నన్ను వొదలడంలేదు, కృష్ణా! నీతో అనుభవించిన ఆనందం జ్ఞప్తికి వొచ్చినప్పుడు, ఈ సంసారసుఖాలు భోగాలు, భాగ్యాలు, లోక వ్యవహారాలు- చివరికి మిగిలిన నా జీవితం— నిస్సారంగా, నిర్జీవంగా, నిష్ప్రయోజనంగా, నిరర్థకంగా తోస్తాయి. ఇటువంటి మానసికావస్థలో నేనేం చేయగలను?" అని మాధవి తన ఆందోళనను వ్యక్తం చేసింది.

"మాధవీ, ప్రేమానుభవంలేక నువ్వు అట్లా కుమిలిపోతున్నావు. ఈ సంయోగం— నీ హృదయ వాంఛ, నా ఆనందం కోసమేననుకోకు. ఇంతకన్నా ఉన్నతమైన శాశ్వతానందాన్ని పొందడానికి ప్రయత్నించు. అది ఒక్క ప్రేమవల్లనే సాధ్యం. అన్నింటినీ ధిక్కరించి, మనసులోంచి పూర్తిగా తోసేసి, నిర్విచారంగా ముందుకు సాగడమే ప్రేమజీవనం.

బంధాలు తెంచుకోలేని ప్రేమ, ప్రేమకాదు. సమస్తాన్ని మరచిపోగల ప్రేమలో నిలిచిపోయిననాడు,జీవితంలో ఏవీ దుఃఖకారణం కాదు. ప్రేమ సాధించలేనిదంటూ ఏదీలేదు. అది విధికృత్యాన్ని సహితం మార్చ గలదు." అన్నాడు కృష్ణుడు.

అతని మాటలతో మాధవి తలతిరిగిపోయింది. ఆలోచనాభారంతో "ఇదంతా నా వంటి దానికి సాధ్యమనే చెపుతున్నావా? కృష్ణా! నా పూర్వ జన్మ పుణ్యఫలంవల్ల నిన్ను చేరి, నా జీవిత సర్వస్వాన్ని నీ పాదాల ముందు అర్పణగా వొదిలేశాను. తత్ఫలితంగా ఈ రాత్రి ప్రేమాను భవాన్ని ప్రసాదించింది, విధి.

"కృష్ణా నువ్వెవరు? అగాధ సముద్ర గర్భంలోంచి ఉవ్వెత్తుగా గర్వంతో లేచే కెరటాలకు కారణ భూతుడవైన తారాపతివా? గాఢాంధ కారాన్ని చీల్చి, దివ్య తేజస్సుతో సమస్త విశ్వాన్ని ప్రకాశింపజేసే సూర్యభగవానుడివా? సంసార కూపంలో కూలబడ్డ నా వంటి సామాన్యు లను ఉద్ధరించ అవతరించిన శ్రీమన్నారాయణుడివా? ఎవరు నువ్వు? నిజం చెప్పు? నీ చుట్టూ ఏమిటీ కాంతి? నా హృదయంలో ఏమిటీ కాంతి?" అంటూ మాధవి కృష్ణుని చేతుల్ని మృదువుగా తన చేతుల్లోకి తీసుకుని, మమతతీరక, ఇంకా ఇంకా ఐక్యం కావాలనే వ్యర్థ, నిరర్థక ఆరాటంలో పడ్డది; మాధవి మనసు.

* * *

క్రమంగా వెన్నెల్లో తెల్లదనం తగ్గి, చల్లదనం ఎక్కువైంది. తేనెలో మునిగి తేలినట్టుగా వున్నాడు, చంద్రుడు. నీడలు పొడుపై పల్చ బడ్డాయి. మందారాలు మంచుబొట్లతో మనుపెక్కాయి. కృష్ణుడు మురళి

వాయిస్తున్నాడు. మున్నెన్నడూ వినని ఆ గంధర్వ గానాన్ని మాధవి ఆశ్చర్యంతో వింటూ, కృష్ణుడు సామాన్యుడు కాడనీ, పరమాత్మస్వరూప మనీ, ప్రేమ స్వరూపుడనీ గ్రహించి, మనోకసారి అతన్ని మనసారా స్మరించి, నిశ్చలంగా అతని చెంత నిలబడింది, మాధవి.

అక్కడనుంచి వారిద్దరూ కోనేటి ఒడ్డుకు వెళ్ళారు. అందున్న హంసలు ఈదుకుంటూ వొచ్చి, మాధవి వైపు మెడలు జాపాయి. ఆమె వాటిని ప్రేమగా చేత్తో తాకబోయి, కాలుజారి కోనేటిలో పడింది. ఆమెను నీళ్ళలోంచి బైటికి తీసే నెపంతో కృష్ణుడూ కొలనులోకి దూకాడు. మాధవి భయంతో అతని మెడను గట్టిగా కావిలించుకుంటే, అతడు చిలిపిగా ముద్దుపెట్టుకున్నాడు.

"పో, కృష్ణా! ఏమిటి, మరీ అల్లరివాడవై పోతున్నావు?" అని రోషం నటించి, దూరంగా వెళ్ళబోయి నీటిలో మునిగిపోతూ, కృష్ణా! కృష్ణా!!" అని భయంతో అరిచింది. కృష్ణుడు కనిపించలేదు.

అంతలో ఆమె పెద్దకేకపెట్టి, కుడికాలుతో దేన్నో తన్నింది. కృష్ణుడు కిల, కిల, నవ్వుతూ నీళ్ళపైకి వొచ్చి, మాధవిని చేతుల్లోకి తీసుకున్నాడు. మాధవి సిగ్గుతో తలవొంచుకుంది. ఇద్దరూ ఒకటే నవ్వుకుంటూ, ఒకరిపై ఒకరు నీళ్లు చల్లుకున్నారు.

కృష్ణుడు ఆ కొలనులోని ఒక తామరపువ్వు కోసి గట్టెక్కాడు. ఆ తర్వాత ఆమెను గట్టుపైకిలాగి, ఆ తామర పువ్వును ఆమె చేతుల్లో వుంచాడు. ఆమె దాన్ని ప్రేమకానుకగా స్వీకరించి, ముఖానికి అద్దుకుని ముద్దుపెట్టుకుంది. దాని పచ్చని పుప్పొడి ఆమె ముఖానికి అంటుకుని, ఒక కొత్త అందాన్ని ఇచ్చింది.

ఆ సంతోషంతో, "కృష్ణా, నువ్వు నా హృదయాంధకారాన్ని తొలగించి, ప్రణయ జ్యోతిని వెలిగించావు. నా కలలు, నా యౌవనం, నా వాంఛ, నా ప్రేమ— అన్నీ ఈ రాత్రి సఫలమైనా, నాకు ఇంకా అసంతృప్తిగానే వుంది- ఈ వాస్తవత్వంలోంచి, ఆ కలల, కలతల, మాయ, మురికి, ఇరుకు లోకంలోకి వెళ్ళవలసి వొస్తున్నందుకు. ఆ లోక మెంత నరక హేతువో నాకు బాగా తెలుసు. విధిని ఎదురించలేని బల హీనురాలిని.

"నిన్ను వొదిలి వెళ్ళడం నాకెందుకో భయంగా వుంది. నేను వెళ్ళిపోతే, నువ్వు నాకు ఇంక కనపడకుండా ఏ దేశానికో, ఏ లోకానికో వెళ్ళిపోతావనిపిస్తోంది.

"కాని, కృష్ణా! నాదొకమనవి. నేనెప్పుడు పిలిస్తే, అప్పుడుపలుకు తావుకదూ? నిత్య జీవితంలో అడుగడుగునా నీ దర్శన భాగ్యాన్ని ప్రసా దించు. అన్ని రూపాల వెనక, నీ రూపాన్ని వ్యక్తపరచు. అన్నిశబ్దాల వెనక నీ మురళీరవం వినిపించేట్లు అనుగ్రహించు," అంది మాధవి.

కృష్ణుడు ఆమె దీనావస్థచూసి, "మాధవీ దిగులు పడకు! నువ్వు ఎక్కడ, ఎట్లా వున్నా నా ప్రేమ నిన్ను క్షణం వొదలదు. నన్ను నువ్వు. సనిద్దరం ఏనాడూ ఇలాగే వున్నాం. కాని, ఇప్పుడు నువ్వు కాలంతో కల్పించబడిన ప్రపంచంమధ్య నిలబడి వున్నావు. అయినా, నీ పిలుపు వెనకనే, నా ఉనికి. నీ హృదయంలోనే నా నివాసం. సమ స్తాన్ని మరచి ప్రేమించు. జీవితానికి ప్రేమ ఒక్కటే శరణ్యం." అన్నాడు.

చంద్రుడు పూర్తిగా పశ్చిమానికి వాలిపోయాడు. నక్షత్రాలు వెల వెల పోయాయి. చీకట్లు తొలగి లోకమంతా ఓవింతకాంతి వ్యాపించింది.

బృందావనమంతా రకరకాల పూలవాసనలతో నిండిపోయింది. దూరాన ఎక్కడో గుడిగంటల చప్పుడు. దానివెంట "అంబా" అంటూ ఆవుదూడ అరుపు.

మాధవి దిగులుగా ఇంటి ముఖం పట్టింది. కృష్ణుడు "మాధవీ" అని పిలవడం వినిపించినా, ఆమె వెనక్కి తిరిగి చూడక పరుగుపరుగున వెళ్ళిపోయింది. తామరపువ్వును మరొకసారి కళ్ళకు అద్దుకుంది.

* * *

క్రమంగా తూర్పు ఆకాశం ఎర్రబడింది. పక్షులు మేల్కొని అరుస్తూ ఆకాశంలో అడ్డంగా ఎగురుతున్నాయి. పొదల్లోంచి లేళ్ళు, కుందేళ్ళు బైటికి దూకాయి. రకరకాల పువ్వులు గుత్తులు, గుత్తులుగా విచ్చుకున్నాయి. వాటి ఆహ్వానాన్ని అప్పుడే అందుకున్నాయి తుమ్మెదలు. గరిక అటూ, ఇటూ వూగుతూ నాట్యం చేస్తోంది. చెట్ల కొమ్మల్ని పెనవేసుకున్న లతలు ఆకాశాన్ని అందుకోవాలని ఆరాటపడుతున్నాయి. మంచు బొట్లు ముత్యాల్లా మెరుస్తున్నాయి. సమస్తం అందంగా, అపురూపంగా, చైతన్యవంతంగా వెలిగిపోతూవుంది. ప్రకృతి పవిత్రంగా తన శుభాగమనాన్ని అనేక విధాల వ్యక్తపరుస్తోంది. ఎక్కడా కల్మషం అనేది లేదు. సమస్త చరాచరం ఆనందంతో తొణికిసలాడుతోంది. ఆ ఉదయం ప్రకృతే ఓ ప్రేమసి పిలుపులాగ వుంది. ఆకాశాన తెల్లని మబ్బుల్ని పరుగెత్తిస్తూ గాలి వీస్తోంది.

కృష్ణుడు ఇచ్చిన ప్రేమకానుక, తామరపువ్వును మాధవి రెండు చేతులతో మృదువుగా పట్టుకుని ఇంటికి వెడుతూవుంటే, దారి పొడవునా ఎందరో చూశారు. ఏదో అర్థమైనట్లు ఆమె వీపు వెనక నవ్వారు.

* * *

తెల్లవారింది. గోవిందు నిద్రలేచి యథాప్రకారం పొలం వెళ్ళే ముందు, పరమేశ్వరునికి నమస్కారం చేసుకునేందుకు పడమటింట్లోకి వెళ్ళాడు. రోజూ ఆ వేళకు మాధవి తలారా స్నానంచేసి, పూజాపీఠం ముందు కూర్చున్నట్లే కూర్చుని వుంది. కాని, ఆరోజు ఆమె ముఖం గొప్ప తేజస్సుతో వెలుగుతోంది. పూజాగది ఎన్నడూ లేనంత ప్రశాంతంగా వుంది. గోవిందు అడుగు పెట్టగానే, అతని మనసు నిర్మలమై, హృదయం శాంతంగా మారిపోవడంతో, రాత్రి తనకేదో పీడకల వొచ్చిందనుకున్నాడు. ఎందుకంటే, కొన్ని కలలు చాలా వాస్తవంగా, నిజంగా జరిగినట్లుగా అనిపిస్తాయి. అలాగే కొన్ని వాస్తవాలు నమ్మశక్యం కాకుండా కలలోలాగ జరుగుతాయి. రాత్రి తన అనుభవం కలో, నిజమో తెలియని అయోమయ స్థితిలోపడి, నిష్కారణంగా మాధవి ధ్యానం భగ్నం చేయడం ఇష్టంలేక గోవిందు వెళ్ళిపోయాడు.

మాధవి ధ్యానంలోంచి చాలా ఆలస్యంగా లేచింది. ఆమె కళ్ళు జ్యోతుల్లాగ వెలుగుతున్నాయి. చుట్టూ చూసింది. అంతా కొత్తగా, వింతగా వుంది. రాత్రి తన అనుభవం కలో, నిజమో, భ్రాంతో, వైష్ణవ మాయో, లేక ఆ ఉదయం తాను ధ్యానంలో వుండగా కాల - దూరాల్ని మించి కలిగిన దివ్యానుభవమో, ఏమో— ఎంత ఆలోచించినా ఆమెకు అంతుచిక్కలేదు. కాని, ఆ అనుభవానికి ఆధారంగా పూజాపీఠంమీద, ఈశ్వర పాదాలముందు బృందావనం కొలనులో వుండే తామరపువ్వు వుంది.

రాత్రి తన అనుభవమే నిజమైతే, ఉదయం భర్త తనను ఎందుకు అడగలేదు ? అంతా మామూలుగానే జరిగిపోయింది. కాని, ఎన్నడూ

లేనిది, తన హృదయం గొప్ప ఆనందంతో నిండివుండటం, మనసు పూర్వం మాదిరిగా దేనినీ తీసుకోకపోవడం గమనించింది, మాధవి.

తెల్లవారినా, వ్రేపల్లె అంతా మేల్కొన్నా ఆ ఉదయం పిల్లలు ఆడుకోలేదు. ఆవులు తలలు వొంచి, ముడుచుకుని పడుకున్నాయి. పెద్దలు నిశ్శబ్దంగా వున్నారు. లేగలు పాలు తాగక, గంతులేయక దిగులుగా వున్నాయి. విహంచిత్రంగా పిట్టలు నిశ్శబ్దమయ్యాయి. గాలి, స్తంభించినట్లు, సూర్యకాంతి మసకబారినట్లు వుంది. అందరి ముఖాలు, దిగులుగా, దుఃఖమయంగావున్నాయి. జరగకూడని ఘోరమేదో వ్రేపల్లెలో జరిగినట్లూ, భరించలేని విపత్తు సంభవించినట్లూ, తమ సర్వస్వం సమూలంగా నేలకూలినట్లూ, సంతోషమనేది ఏ కోణానా లేకుండా తెల్లవారితే కలకలలాడే పల్లె, కళావిహీనంగా వుంది. ఏదో తెలియని భీతి, వారి హృదయాల్ని ఆవహించింది.

కారణం, ప్రతి ఉదయం కృష్ణుని వేణువు వినిపించేది. పనుల్లో మునిగివున్న వ్రేపల్లె వాసులకు ఆ వేణునాదం ఓదార్పును, ఉపశమనాన్ని, ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని, ఉల్లాసాన్ని కలిగించేది. కాని, కొందరు గోపాంగనలు "చూడు ! ఆ కొంటెకృష్ణుడు," అనేవారు ఛలోక్తిగా. దృష్టిపెట్టి వినేవారికి, ఆ మురళీగానం గొప్ప ఆనందంగా వుండేది. కాని, ఆరోజు ఉదయం ఎంత సేపటికీ కృష్ణుని మురళీగానం వినరాలేదు. ఎవరికీ అతను కనరాలేదు. కారణం తెలియక అందరూ కలవరపడ్డారు. నిలవలేని వాళ్ళు కన్నీళ్ళు పెట్టుకుని ఆందోళన చెందారు.

*    *    *

బలరామ, కృష్ణుల్ని ఏదోవిధంగా హతమార్చాలనేదురుద్దేశ్యంతో కంసుడు ధనుర్యాగం ఆరంభించి, వారి ఇద్దర్నీ మధురానగరం తీసుకు రమ్మని అక్రూరుణ్ణి వ్రేపల్లెకు పంపించాడు. అతడూ ఆ పౌర్ణమిరోజు సాయంత్రమే వ్రేపల్లెకు వేంచేశాడు.

ఆ ఉదయం బలరామ, కృష్ణులు అక్రూరునితో కలిసి మధురా నగరం వెళ్ళిపోయారు. ఆ సంగతి తెలిసి, వ్రేపల్లె వాసులంతా అక్రూరుణ్ణి క్రూరుడని నిందించారు. తమ రక్షకుణ్ని, ప్రేమమయుణ్ని, కృష్ణుణ్ని, తిరిగి వెనక్కి పంపించమని దేవతలకు మొక్కారు.... ఈశ్వరుణ్ణి ప్రార్థించారు. రోదించారు. తమ బ్రతుకులు నిస్సారమై, శూన్యమైనట్లూ, తమ జీవితాల్ని అంధకారం అలుముకున్నట్లూ, తమ అదృష్టం ఊడ్చుకుపోయినట్లూ కుమిలి కుమిలి ఏడ్చారు. ఎవరి నోటా మాటలేదు. అందరి ముఖాలూ వెలవెలబోయాయి.

అశనిపాతంలాంటి ఆ వార్త మాధవి చెవిన పడింది. ఆమె ఓ క్షణం నిశ్చేష్టురాలైంది. ఆమె చూపు, మనసు ఏకాగ్రమైనాయి. రాత్రి, అనుభవానందం. ఉదయం, భరించలేని వియోగ విషాదం. రాత్రి, జగన్మోహనాకారుడైన కృష్ణునితో గడిపిన అమృత ఘడియలు. ఉదయం, దుఃఖదాయిష్టమైన వియోగవార్తలు. వ్రేపల్లె వొదిలి కృష్ణుడు మధురా నగరం వెళ్ళిపోయాడన్న వార్త, మాధవి హృదయంలో గొప్ప తేజస్సుతో నిండిన మహా శూన్యం. కృష్ణుని కలుసుకున్న రాత్రే, తేజో మయం. కృష్ణుడులేని ఉదయం ఆమెకు అంధకారమయం.

మాధవి ప్రేమ, సముద్రమంత అపారం. పర్వతమంత గంభీరం. మధుమాలతి అంత మధురం. దైవమంత సత్యం.

ఆమె హృదయాంతరాళంలో, ఆమె చుట్టూ, సమస్త చరాచరంలో కృష్ణుడే! అటువంటి కృష్ణుడు తనకు బహుదూరమైనాడన్న యోచన, తనకే సిగ్గుగా తోచింది, మాధవికి.

* * *

కలలోలాగ మాధవి బృందావనం వెళ్ళింది, విచ్చల విడిగాపూసిన అడవి జాజులు ఇంకా అందమైన కలలు కంటూనే వున్నాయి. ఆమెకొంత సేపు గోవర్ధన గిరిని చూస్తూ, గున్నమామిడి చెట్టుమొదట కూర్చున్నది. ఆ తర్వాత శిరీషానికి వేళాడుతున్న ఉయ్యాలను ప్రేమగా వూపింది. అక్కడనుంచి చెంపకచెట్టు వెనక్కి వెళ్ళి, తనకు అమూల్యమైనది ఏవో పోయినట్లు వెదికింది. కోనేటి మెట్లపై కూర్చుని, కూని రాగాలు తీస్తూ హంసలతో ఆడుకుంది. పొన్న చెట్టుదగ్గర పడివున్న పిల్లనగ్రోవిని తీసి, దానికి ఒకటే ముద్దులు పెట్టింది.

తులసమ్మకు మొక్కింది. యమునకు చెప్పుకుని ఏడ్చింది. బృందావనమంతా పిచ్చిగా తిరిగింది. కృష్ణుని జాడ తెలుసునేమోనని అన్నింటినీ పిలిచి పిలిచి అడిగింది. ఏ ఒక్క దానినుంచీ సమాధానం రాలేదు. దేవకాంచన చెట్టుకొమ్మను అనుకుని, కృష్ణుడు నిజంగానే మధురానగరం వెళ్ళిపోయాడా?" అని తనను తాను ప్రశ్నించుకుంది, పిచ్చిగా మాధవి.

"అవును, నా కృష్ణుడు నన్ను వొదిలి నిజంగానే మధురానగరం వెళ్ళిపోయాడు. నన్ను ప్రేమతో తీసుకోవడానికే రాత్రి వున్నాడు. అతని ప్రవర్తనలో కోర్కె, వాంఛ, మోహం, మోసం ఏమీ లేదు. ఏదైనా

వుంటే, అది నా మనసులో వుంది. కఠరకు విధి, మా ప్రేమబంధాన్ని గొడ్డలిపెట్టి నరికింది. ఎంత ప్రేమించీ, విరహపడీ ఓ రాత్రంతా తనివి తీరా అనుభవించినా, ఇంకా నా హృదయానికి అందని విశ్వసౌందర్యాన్ని ఒక్క వ్రేటుతో తెగనరికింది విధి.

"కృష్ణా! నన్ను "మాధవీ", అని ప్రేమగా పిలిచే నీ పిలుపు వినని నా దౌర్భాగ్యమేమని చెప్పను? ఇప్పుడు నేనేం చెయ్యను? నాలోంచి ఈ మధుర భావనలూ, సంయోగవాంఛలూ పోయేదెట్లా? నిన్ను చూడకుండా, నిన్ను కలుసుకోకుండా సృష్టిపైన విరహబాధ నన్ను ఎట్లా వొదులుతుంది? సమస్త ప్రాణికోటి, అనేక విధాల సదా సంయోగాన్నే కోరుతుంది. ఇంకా ఇంకా ఐక్యం కావాలనే వ్యథ, నన్ను బాధిస్తోంది కృష్ణా! నా దాహం తీర్చు: లేదా. నన్ను హతమార్చు," అని చుట్టూ చూసి, "ఏమిటీ సుశబ్దాలు? విశ్వమంతా ఏమిటి ఈ మురళీ రవాలు? అన్ని దిక్కులనుంచీ ఏమిటీ ఆహ్వానాలు? అంతటా ఏమిటీ ఈ దివ్యకాంతి?

"కృష్ణా! ఇవన్నీ నన్ను నిలవ నియ్యడం లేదు. ఏం చెయ్యను? ఈ సృష్టిలో నిరంతరం ఒకదాన్ని చూసి, ఒకటి ఆకర్షణపడి, విరహపడతాయి. ఒకదాన్ని ఒకటి ప్రేమతో పిలుచుకుని, కలుసుకుని ఆ సంయోగానంద పారవశ్యంలో తృప్తితో, సంతోషంతో తేలిపోతాయి.

"కృష్ణా, నాకు నువ్వు తప్ప ఇంకెవరున్నారు? నువ్వే నా ప్రియుడవు, సఖుడవు, నాథుడవు, గురుడవు: తల్లి, తండ్రి, దైవం సమస్తం నువ్వే," అనుకుంటూ మాధవి బృందావనమంతా తిరిగింది.

కృష్ణణ్ణి స్పృశించాలనే మాధవి కోర్కె, అతన్ని దర్శించాలనే ఆమె ఆపేక్ష, అతన్ని కలుసుకోవాలనే ఆమె తపన — అతని కోసం

జాచిన ఆమె శూన్యహస్తాలు మంచుతో బరువెక్కిన గాలినే హత్తుకున్నాయి.

రాత్రి కృష్ణునితో గడిపిన అమృత ఘడియల మాధుర్యాన్ని, అతనితో కలిసి తిరిగిన స్థలాన్ని, చూసిన దృశ్యాన్ని, పొందిన ప్రేమా లింగనాన్ని, ఆనందాన్ని మళ్ళా మళ్ళా గుర్తుచేసుకుంది, మాధవి.

ఎటు చూసినా మాధవికి కృష్ణ రూపమే కనుపించింది. ఎటుచెవి యొగ్గి విన్నా, మురళీ స్వరమే వినిపించింది. పొద్దెక్కేకొద్దీ మాధవి కళ్ళల్లో కృష్ణ ఆవేశమే అధికంగా కనుపించింది. ఆమె దృష్టిపూర్తిగా మారింది.

అంతలో ఓ నల్లని మేఘం, గోవర్ధన గిరిపైనుంచి కదిలిపోవడం చూసి, "కృష్ణా! ఓ నీల మేఘశ్యామా! నానుంచి ఎందుకు దాక్కుంటున్నావు? ఆ నల్లని మేఘంలో కలిసి ఎక్కడదాక్కున్నావు? గగనతలంలో ఎక్కడ విహరిస్తున్నావు?

"ఓ మేఘమా, నువ్వయినా నా మీద దయచూపు! నాకూ,కృష్ణునికి మధ్య అడ్డుపడకు! నీకు అంతగా వర్షించాలనే అభిలాషవుంటే, నల్లని వర్షపు మేఘాలు కమ్మిన నా కళ్ళల్లోకి వొచ్చి, నీ వాంఛతీరావర్షించు," అని తన దృష్టిని దేహం మీదికి మరల్చి, "కళ్ళల్లారా, కృష్ణుని చూడలేని మీరువుండి నాకేం ప్రయోజనం? శాశ్వతంగా మూసుకుపొండి? చేతుల్లారా కృష్ణ పాదస్పర్శ పొందలేని మీరు నాకెందుకు పనికి వొస్తారు? జీవితాన్నిచ్చిన ప్రభూ, వొచ్చి, నువ్విచ్చిన జీవితాన్ని నువ్వే తిరిగి తీసుకో," అంది మాధవి.

ఆ తర్వాత చాలా సేపు మౌనంగా, నెమ్మదిగా, నిదానంగా అంతర్యంలోకి చూసుకుంది, మాధవి.

కృష్ణుడు ఆమె కళ్ళలోనే కొలువున్న సంగతి ఆమెకు తెలియక, అతని కోసం, గుడ్డిగా, మూర్ఖంగా, అజ్ఞానంతో అన్ని దిక్కులా వెదికింది.

"నువ్వు ప్రేమించే నాథుడు, నీలోనే వున్నాడు. ఇంక నువ్వుఅతని కోసం బైట వెదకటం దేనికి?" అని అంతర్వాణి చెప్పినట్లు అనిపించి, "నాలోనా?" అంటూ తనను తాను వొలిచి చూసుకుంది.

క్రమంగా మాయతెరలు తొలగిపోయాయి. సమస్త బంధాలూ తెగిపోయాయి.

మాధవిని వెతుక్కుంటూ, గోవిందు బృందావనం వెళ్ళాడు, ఆమె చేష్టలు వింతగా వున్నాయి. అతడు ఆమెకు ఎదురుగా నిలిచినా, ఆమె చూపు అతనిమీద నిలవలేదు.

క్రితం సాయంత్రం వరకు మాధవి చాలా వివేకవంతురాలు, ఆదర్శ గృహిణి, ధర్మపత్ని. కాని, ఒక్కరాత్రి కాలంలో, ఏంజరిగిందో ఏమో కాని, ఆమెలో పూర్తి మార్పు వొచ్చింది. అసలేం జరిగిందో ఎవరికీ ఏమీ తెలియదు. బహుశా ఆమెకుకూడా తెలియదు. కాని, ఆమె జీవితంలో దివ్యమైనదేదో జరిగింది.

గోవిందు నెమ్మదిగా ఆమె దగ్గరకు వెళ్ళి, ప్రేమగా "మాధవీ, ఎందుకు ఇవాళ ఇట్లా వున్నావు? ఏం జరిగింది? నువ్వు మామూలుగా మన ఇంట్లో మసలకపోతే, నా జీవితమే స్తంభించిపోతుంది," అని ఆమెను ఇంటికి తీసుకు వెళ్ళాడు.

* * *

మాధవి ఇంటికి వెళ్ళిందేకాని, దేన్నీ కన్నెత్తి చూడలేదు. గోవిందుతో మామూలుగా మాట్లాడలేదు. ఇంటి పనులేవీ పట్టించుకోలేదు.

అప్పటికే మాధవి సంగతి పల్లెఅంతా పొక్కింది. నలుగురూ నాలుగు రకాలుగా చెప్పుకున్నారు.

మాధవి పూజాపీఠం దగ్గరకు వెళ్ళి, అందున్న తామర పువ్వును భక్తి ప్రేమలతో చేతుల్లోకి తీసుకుని, కళ్ళకు అద్దుకుని, ముద్దుపెట్టుకుంది. గోవిందు ఆమెను అనుసరించడం వల్ల అతనిదృష్టి తామరపువ్వు మీద నిలిచింది. ఓ క్షణం అతడూ నిశ్చేష్టుడైనాడు. రాత్రి అనుభవం తాలూకు అనుమానం గట్టిపడింది. రాత్రి తాను కళ్ళారా చూసిందీ జరిగిందీ "అంతా నిజమే" అనే నిర్ణయానికి వొచ్చాడు. కాని, బృందావనం వెళ్ళిన గోపికలందరి స్థితీ, అట్లా కాలేదు కదా? ఒక్కరాత్రిలో మాధవిలో వూహించరానంత మార్పు వొచ్చింది. అసలు ఏం జరిగిందో ఎంత ఆలోచించినా అతనికీ అంతు చిక్కలేదు.

మాధవి పూజా పీఠం ముందు కూర్చుని, కన్నీరు కారుస్తూ తన హృదయా వేదనను కృష్ణునికి మౌనంగా విన్నవించుకుంది: "కృష్ణా! అనాహత మురళీ రవం, నాలో ప్రతిధ్వనిస్తోంది. ఆ నాదానికి నా దేహం ప్రకంపిస్తోంది. ఏమీ ఎరుగని నన్ను నీ గానంలో లీనం చేశావు. నీ మురళీ స్వనంతో, మొగ్గలాంటి నా జీవితాన్ని వికసింపజేశావు.

"శతసహస్ర తంతువుల వీణవలె, నా దేహం నీ స్పర్శతో అద్భుతంగా మోగుతోంది. విచ్చుకున్న పువ్వుల్ని మధువుతో పరిమళంతో నింపే నీ గానం, నన్నూ నడుపుతోంది. విశ్వమే అమరగానంతో నిండి వుంది.

"నువ్వులేని ఈ ఉదయం, అంధకారంగా అర్థరహితంగా, అగమ్యంగా, శూన్యంగా వుంది. ఆ మహా శూన్యం లోంచి నీ రూపదర్శనం కోసం నిరీక్షిస్తున్నాను— కృష్ణా! ఒక్క నీ కోసమే వేచి వున్నాను. వొచ్చి నన్ను తీసుకో. నువ్వు రాకపోతే, నా బ్రతుకే భారమై పోతుంది. నా నిర్లక్ష్యాన్ని చూసి, లోకులు నిందిస్తారు. భర్త బాధిస్తాడు.

"నా మూర్ఖత్వమే, నా అల్పత్వమే నన్ను నీనుంచి వేరు చేసింది. నా జీవితాన్నే నాశనం చేసింది. తెగించి, నీ దగ్గరకు వొచ్చి, నా పెద్దతనంతో నిన్ను మురిపించాలని, ముద్దులతో, కౌగిలింతలతో నిన్ను బంధించి, నిన్ను నా వాడిని చేసుకోవాలనీ చూశాను; నిన్నటి వరకు. నా ఆశలన్నీ నిష్ఫలమై, నా ప్రయత్నాలన్నీ వ్యర్థమై నాకే ఎదురుతిరిగాయి. ఇప్పుడేం చెయ్యను ? అన్ని విధాలా బలహీనురాలినై, విధి ముందు, ఇలా వొంచి నిలబడ్డాను. ఇంక నీవే శరణ్యం.

"కులట అనిపించుకున్న స్త్రీకి, ఈ లోకంలో శాంతి, విశ్రాంతులు వుండనివ్వరు. షుద్ర పరిహాసాలతో, వికృత హావ, భావ, అహంభావ, నీతి వచనాలతో అనుక్షణం నన్ను చెప్పి పొడుస్తూవుంటే, వాళ్ళ మధ్య బ్రతకడం ఘోరమనిపిస్తుంది. క్రూర విధికీ, మూఢ ప్రపంచానికి పవిత్ర ప్రేమ అర్థంకాదు. అధమాధములంతా ధర్మనిర్ణేతలై, అధికారులై శాసిస్తే, నా అహం ఎదురుతిరుగుతుంది. నీతో పొందిన ఊహాతీతమైన ఆనందానుభవాన్ని, తిరిగి పొందాలనే ఆకాంక్ష కొద్దీ లోకాల నలుదిక్కులకూ పరిగెత్తాలని చూస్తాను. "మోహంతో ఆనందాన్ని ఎందుకు పాడుజేసుకుంటావు?" అన్న నీ మాటల్ని మరచిపోయి. మోహమంటే ఎరుగని పురుషోత్తముడివి నువ్వు. నువ్వు ఎంతమంది గోపికలతో కూడినా, ముందెన్ని వివాహాలు చేసుకున్నా, ఏదీ నిన్ను అంటదు. నువ్వు

నిష్కల్మష బ్రహ్మచారివి. ఎన్ని ఆలింగనాల్లోంచీ, ఏమీ అంటక నిలబడగలవు.

"లోకాల ప్రియులకోసం, తెరచుకున్న హృదయం నీది. నువ్వు నామీద ప్రేమచేత, రాత్రంతా నాతో క్రీడించావు. ఆ ఘడియలన్నీ నన్ను ఈ చివర నుంచి, ఆ చివరి వరకు అన్ని లోకాలూ తిప్పాయి. నాకు కావలసింది, నువ్వు. నువ్వు తప్ప మరో స్వర్గం అవసరంలేదు. నా వ్యక్తిత్వం మీద, నాకేమాత్రం లక్ష్యంలేదు. ఎన్నోళ్ళోకాదు, ఎన్ని జన్మలైనా నీ మురళీ మృదుస్వరంకోసమే కాదు; నీ దివ్యహస్త స్పర్శ కోసం కూడా, ఎప్పటికీ ఎదురుచూస్తూ వుంటాను. ఏ క్షణాన నువ్వు నన్ను బంధ విముక్తురాలను చేసి, నీ చేతుల్లోకి తీసుకుంటావో: ఆ శుభ సమయం కోసం నిరీక్షిస్తూ వుంటాను. ఈ వ్యధ, ఈ అన్వేషణ వృథా పోదని నా దృఢ విశ్వాసం.

"ఏ మోహం నన్ను నీ పావాల వొద్దకు చేర్చిందో, ఆ మోహం కాలి, బూడిదైపోయిందిప్పుడు. నా ప్రేమను, మంచువలె కప్పిన మోహాన్ని, నీ దృష్టి కిరణ ప్రసారం కరిగించింది. నీ ప్రేమ, నా మోహ సంబంధ శృంఖలాలను తెంచేసింది. మోహం, అంధకారమనీ, దుఃఖకారణమనీ ఈ ఉదయం స్పష్టంగా తెలిసింది. అయినా నీ రూపం మీద నా మోహాన్ని త్యజించలేకుండా వున్నాను. అదే నన్ను నీ నుంచి దూరంచేసిందిప్పుడు.

"కృష్ణా! నీ వేణుగానంతో నా జీవితాన్నే మరిపింపజేశావు. నీ చూపులతో, మాటలతో, మృదు స్పర్శలతో, మధుర చుంబనాలతో నేనెవరినో కాకుండా చేశావు. నా జీవితాన్ని నీ చేతుల్లో వుంచిన మరు

క్షణం నుంచీ, జీవన మాధుర్యాన్ని అనుభవిస్తున్నాను. నా జీవితమే వేణువై పోయింది. నీటిబుడగ బ్రద్దలై, సముద్రమైనట్లు. విశ్వమంతా వ్యాపించి, పరవశత్వాన్ని కలిగించే నీ మురళీగానం వలె, నీ నిర్మల ప్రేమ, నాలో శాశ్వతంగా నిలుపు.

"నా వెర్రి కాకపోతే, ఎప్పుడూ నీ హృదయంలో వెలుగుతూ వుంటానన్న నీ మధుర వాక్కు, అప్పుడే మరచిపోయాను — అన్ని దిక్కులనుంచీ అనేక విధాల నీ ప్రేమాలింగనాల్ని అనుభవిస్తూ కూడా.

"కృష్ణా, నిన్ను పొందటంకోసం, ఏ తీర్థాల్లోనూ మునగనవసరం లేదు. ఏ పుణ్యక్షేత్రాలూ, ఆలయాలూ దర్శించనవసరంలేదు. ఏ దేవతల్నీ కొలిచి ప్రార్థించ నవసరంలేదు. ఏ సాధనలూ చేయనవసరం లేదు. దేనినీ ఆశ్రయించి, అనుసరించి, ఆరాధించవలసిన పనిలేదు.

"నువ్వు నా వాడవు. నేను, నీ దానను. నీలో నేను, నాలో నువ్వు— ఎప్పుడూ ఏకమై వున్నాం.

"నా హృదయంలో ఎప్పటికీ ఒంటరిగా ఉయ్యాల వూగేది నువ్వే కృష్ణా!" అనుకుంటూ మాధవి తన్మయత్వంలో పక్కకు వాలిపోయింది.

గోవిందు ఆమెను ప్రేమతో లేవనెత్తి, ఉపచారాలు చేశాడు. ఆనాటి నుంచి మాధవి సహజ సమాధి స్థితిలో వుండిపోయింది.

విశ్వమంతా కృష్ణలీలగా గోచరించడంవల్ల, చంద్ర దర్శనమైన సముద్రం మాదిరిగా, ఉషారుణకాంతి సోకిన పద్మం మాదిరిగా, మాధవి ఎప్పుడూ సంతోషంగా వుండేది. ఆమె సహవాసంలో గోవిందు ఆనందంగా కాలం గడిపాడు.

* * *

ఉదయాన ప్రతి మంచుబొట్టూ, ప్రతి గడ్డిపువ్వూ, చెట్లు, పక్షులు, గోవులు, గోపికలు, గోపబాలురు, బృందావనం, యమునానది-సమస్తం కృష్ణుణ్ణే గుర్తుచేసేవి మాధవికి.

ఆమె కళ్ళముందు సమస్త చరాచరం కొత్తగా, వింతగా, అందంగా, శక్తివంతంగా, చైతన్యవంతంగా సాక్షాత్కరించేది. పూర్వం మాదిరిగా, ఆమెలో ఆశా, ప్రయత్నం, అన్వేషణ, ఆరాటం, ఆందోళన, ఆవేదన ఏమీలేవు. పసిబిడ్డ చూపువంటి సహజమైన, నిర్మలమైన దృష్టి ఏర్పడింది ఆమెలో.

క్రమంగా కృష్ణుడు ఆమె బ్రతుకులో, ఆలోచనల్లో, కలల్లో లక్ష్యమైనాడు.

గడచిన మృదు మధుర స్మృతిని తలచుకుంటూ, కృష్ణనామం స్మరించుకుంటూ మాధవి శేష జీవితాన్ని గడిపింది.

* * *

రోజులూ, వారాలూ, నెలలూ, సంవత్సరాలూ గడచినా, రాత్రికి, రాత్రులు శివరాత్రి జాగరణ చేసినా; మాధవికి మళ్ళా అటువంటి మధురానుభవం ఎప్పుడూ కలగలేదు.

తనకు తటస్థపడ్డ అనుభవం కలో, మాయో, భ్రాంతో లేక, జన్మ తరించేందుకు కలిగిన శాశ్వత సత్యమో, ఏమో ఎన్నేళ్ళు ఎంత ఆలోచించినా గోవిందుకు అర్థంకాలేదు.